రామ్, శ్యామ్ పాపిన్స్- దొంగను పట్టేస్తున్నారు

చీకటి రాత్రి. అంతా ఎంతో నిశ్శబ్దం. హాయిగా నిద్రలో వున్నారు రామ్, శ్యామ్.

కిటికీలోంచి దూకాడో దొంగ, అయ్యో పాపం వారికెంతటి కష్టం

అక్కరలేనట్లుందా దొంగకు బంగారం, అందుకే పడ్డాయి కళ్ళు పాపిన్స్‌పైనే.

కుక్క అరచింది 'భౌ, భౌ, భౌ' అంటూ, దొంగ తికమక పడ్డాడు 'భా, భా, భా' అంటూ.

రామ్ లేచి వేశాడొక గెంతు, ఇట్టే పట్టేశాడా దొంగను అంతే.

లేదు నీకిక బెయిలు, నీకు శిక్షే మరి ఇక జెయిలు.

రామ్, శ్యామ్ చేశారెంతో సాహసం, వారికే పాపిన్స్ మరి బహుమానం.

నోరూరించే
మనసుదోచే
మై మరపించే

5 పండ్ల సువాసనలలో 13 మధురమైన బిళ్ళలు ప్రతి ప్యాక్‌లో నిమ్మ, మోసంబి, నారింజ, అనాస మరియు రాస్ప్‌బెరీ!




evreest/508b/PP TL

# గమనిక

అనివార్య కారణాల వలన అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్ పాపల పోటీ వాయిదా పడింది. ఈ పత్రిక గత సంచికలో దీనికి సంబంధించిన ప్రకటన ఒకటి పడింది. అది పడకుండా ఉండటానికి మేము చేసిన ప్రయత్నాలు విఫలమైనాయి. ఎవరికైనా ఇబ్బంది ఏదైనా కలిగి ఉంటే చింతిస్తున్నాము.

అమృతాంజన్ లిమిటెడ్

14/15, లజ్ చర్చ్ రోడ్, మైలాపూర్

మదరాసు - 600 004













మా అందరకూ
ఇష్టమయిన
పత్రిక

# చందమామ



## మీకూ అంతేగా!




చందమామ యింటిల్లిపాదీ చదువుతారు.
ఇంగ్లీషు, హిందీ, మరాఠీ, తెలుగు, కన్నడం, తమిళం, గుజరాతీ, మలయాళం, బెంగాలీ, ఒరియా—పది భాషలలో ఇది వెలువడుతున్నది. ఈ పిల్లల పత్రికలో అపరూపమయిన కథలుంటాయి. ప్రతి హృదయాన్నీ సంతోషపరుస్తాయి.

చందమామ పిల్లల మాసపత్రిక. ఇది చదివితే పిన్నల ఉత్సాహం పెద్దలకు కలుగుతుంది. పెద్దల విజ్ఞానం పిన్నలకు అబ్బుతుంది.



చందా వివరములకు: డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, మద్రాసు -600026.



# చందమామ

సంస్థాపకుడు : నాగిరెడ్డి
సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ నెల బేతాళ కథ [''పురుష ద్వేషిణి''] ఎస్. ఉమామహేశ్వర రావు రచన. ఇది మంచి నీతి గల కథ. సాధారణంగా ఎవరు దేన్ని ద్వేషించినా దాని వెంట తమలో కూడా ఏదో ఒక అంశాన్ని ద్వేషిస్తారు. పేదలు తమ పేదరికాన్ని ద్వేషించటం వల్ల ధనికులను ద్వేషిస్తారు. అన్ని ద్వేషాలకూ ఏదో ద్వేషమే ఆధారంగా కనబడుతుంది. బానిసలు తమ బానిసత్వాన్ని ద్వేషించటం ఆరంభించేదాకా తమ యజమానులను ద్వేషించరు.

సంపుటి 54 ఫిబ్రవరి '74 సంచిక 2

CP






విద్వా నేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమమ్,
న హి వంధ్యా విజానాతి గుర్వీం ప్రసవవేదనామ్. 1

[విద్వాంసుల పరిశ్రమ విద్వాంసుడికే తెలుస్తుంది. భయంకరమైన ప్రసవవేదన గొడ్రాలి కేమి తెలుస్తుంది?]

విద్యా నామ నరస్య రూప మధికం, ప్రచ్ఛన్నగుప్తం ధనం,
విద్యా భోగకరీ, యశస్సుఖ కరీ, విద్యా గురూణాం గురుః,
విద్యా బంధుజనో విదేశగమనే, విద్యా పరా దేవతా,
విద్యా రాజసు పూజ్యతే, న హి ధనం; విద్యావిహీనః పశుః. 2

[విద్య మనిషికి అందం; దాచిన సొమ్ము; భోగాన్నీ, కీర్తినీ, సుఖాన్నీ కలిగిస్తుంది; గురువులకు గురువు; దేశం కాని దేశంలో బంధువులాటిది; పరదేవత; దాన్ని రాజులు పూజిస్తారు, ధనాన్ని కాదు. విద్య లేనివాడు వింతపశువు.]

విత్తం, బంధు, ర్వయః, కర్మ, విద్యా భవతి పంచమమ్,
ఏతాని మాన్యస్థానాని తురీయో యద్య దుత్తరం. 3

[సన్మానించదగిన ధనమూ, బంధువూ, వయసూ, కర్మా, విద్యా అనే అయిదింటిలో క్రమంగా ఒక దాని కన్న రెండవది మేలైనది.]



# యక్షపర్వతం

## 21

[కొండకోట వద్ద వీరపుర అశ్వికుల చేత ఓడింపబడిన స్వర్ణాచారి కొద్దిమంది ఉష్ట్ర యోధులతో అరణ్యంలోకి పారిపోయాడు. అక్కడ అతడికి ఖడ్గ జీవదత్తులూ, సమరబాహూ కనిపించారు. గురుభల్లూకుడు తన శిష్యుల గురుభక్తిని రుజువు చేసేందుకు, వాళ్ళల్లో ఒకణ్ణి చెట్టు మీదినుంచి కిందికి దూకమన్నాడు. తరవాత—]

గురుభల్లూడికి శిష్యుడు చెట్టు మీది నుంచి దూకటం చూస్తూనే జీవదత్తుడు పరిగెత్తుకుంటూ పోయి, వాడు యింకా నేలకు పదీ పన్నెండడుగుల దూరంలో వుండగా తన దండం అడ్డు పెట్టాడు. ఎలుగ్గొడ్డువాడు తన గురువు పేరును స్మరిస్తూ, వేగంగా వచ్చి దాని మీద పడగానే జీవదత్తుడు వాణ్ణి చేతులతో పట్టుకుని భూమి మీద నిలబెట్టాడు.

ఎలుగ్గొడ్డు వాడు తన గురుభక్తిని రుజువు చేసుకునే అవకాశం పోయినందుకు దిగాలు పడిపోతూ, జీవదత్తుడితో, ''అయ్యా, మధ్య దారిలో నన్ను పట్టుకుని నేల తాకి ప్రాణం పోకుండా కాపాడారేమో గాని, నేను చచ్చి స్వర్గం చేరే అవకాశాన్ని చెడగొట్టారు,'' అన్నాడు.

ఆ మాటలకు జీవదత్తుడు నవ్వి "ఒరే, నువ్వు నేల తాకి చచ్చి స్వర్గం చేరేవాడివో



లేక నరకానికే పోయూవాడివో ఎవరు చూశారు? ఒకటి మాత్రం గట్టిగా రుజువు చేశావ్; నీ గురువాజ్ఞను దైవాజ్ఞగా పాలించావు. ఇప్పుడు నువ్వు, నీ గురువుకూ, అతడి ద్వారా సమరబాహుకూ చేయవలసిన సాయం చాలా వుంది.'' అన్నాడు.

ఆ సరికి అక్కడికి గురుభల్లూకుడూ, సమరబాహూ, ఖడ్గవర్మా వచ్చారు. గురుభల్లూకుడు ఆనందం పట్టలేక ఖడ్గ జీవదత్తులతో, ''అయ్యల్లారా, నా శిష్యుల గురుభక్తి ఎలాంటిదో స్వయంగా చూశారు గదా? ఇక వాళ్ళను మీ ఇష్టం వచ్చిన పనికి ఉపయోగించుకోండి. సమరబాహు యీ అరణ్య ప్రాంతాలకు రాజై స్వర్ణాచారి ఆయనకు మంత్రి అయితే, నా బిల దుర్గంలో వృకేశ్వరీదేవి పూజాపునస్కారాలు నిర్విఘ్నంగా సాగిపోతాయి.'' అన్నాడు.

''భల్లూకా! ఆ దేవీపూజ లేవో యితర్ల ప్రాణాలకు అపాయం కలగకుండా జరిగేలా చూసే బాధ్యత సమరబాహు పైన వున్నది!'' అని జీవదత్తుడు, గురుభల్లూకుడి శిష్యుల కేసి చూసి, ''ఈ చెట్టు మీంచి గెంతిన వాడితోపాటు నీ శిష్యుల్లో మరొకడు నే చెప్పబోయే పని సాధించుకు వచ్చేందుకు కావాలి.'' అన్నాడు.

గురుభల్లూకుడు తన శిష్యుల్లో మరొకణ్ణి దగ్గిరకు పిలిచి, వాణ్ణి చెట్టు మీంచి దూకిన వాడి పక్కన నిలబడమన్నాడు. జీవదత్తుడు ఆ ఇద్దరితో, ''ఒరే, మీ ఇద్దరూ ప్రాణాలు పోయినా యిక్కడ ఏం జరిగిందీ ఎవరితో చెప్పకుండా ఒక గురుకార్యం సాధించాలి. ఈ చుట్టు పక్కల వున్న అరణ్యంలో ఎక్కడో వీరపుర ఆశ్వికులు వుంటారు. మీరు పని గట్టుకుని వాళ్ళ కంటబడినట్టు కాకుండా, అజాగ్రత్తవల్ల దొరికిపోయినట్టు నటించి, ఆ ఆశ్వికుల్ని కలుసుకోవాలి. తరవాత వాళ్ళతో కొండకోట నుంచి పారిపోయిన సమరబాహు అనుచరులందరూ మీ గురువుదైన బిలదుర్గంలో దాక్కుని

వున్నట్టు నమ్మబలకాలి: చెప్పిందంతా అర్థమైందా?'' అన్నాడు.

''అయ్యా, ఇందులో అర్థం కానిదే ముంది! ఇది గురుకార్యం, రాచకార్యం కూడా. ఆ ఆశ్వికుల్ని కలుసుకుని మీరు చెప్పిన మాటలు చెప్పమన్న విధంగా చెప్పి, పని నెరవేర్చుతాం,'' అన్నారు భల్లూకుడి శిష్యులిద్దరూ.

''అయితే బయలుదేరండి, ఆలశ్యం ఎందుకు,'' అన్నాడు జీవదత్తుడు.

శిష్యులిద్దరూ గురుభల్లూకుడికి సాష్టాంగపడి లేచారు. భల్లూకుడు వాళ్ళ తలల మీద చేయి పెట్టి, ''ఆ ఆశ్విక శత్రువులు మిమ్మల్ని వేగుల వాళ్ళుగా గుర్తించి నిజం చెప్పమని ఎన్ని హింసల పాలు చేసినా, మీరు మన రహస్యాలు చెప్పగూడదు!'' అన్నాడు భీకరమైన స్వరంతో.

భల్లూక శిష్యులిద్దరూ తలలు వంచి, ''గురుభల్లూకా, మీ ఆజ్ఞ వృకేశ్వరీదేవి ఆజ్ఞతో సమానం!'' అని అక్కణ్ణించి బయలుదేరారు.

వాళ్ళు అరణ్యంలో చాలాసేపు తిరిగి, సూర్యుడు ఆకాశ మధ్యం నుంచి పడమటి దిక్కుకు వాలుతున్న సమయంలో ఒక చెట్టుకింద వీరపుర ఆశ్వికుల్ని చూశారు. ఆశ్వికులు నలుగురూ గుర్రాలు



దిగి ఏదో మాట్లాడుకుంటున్నారు. వాళ్ళ వాలకం చూస్తే, స్వర్ణాచారి అనుచరుల కోసం అరణ్యంలో చాలాదూరం తిరిగి అలిసిపోయినట్టుంది.

ఆశ్వికుల్ని చెట్ల చాటునుంచి చూసిన భల్లూకుడి శిష్యులిద్దరూ ఒక క్షణకాలం సంప్రతించుకుని పెద్దగా గొంతులెత్తి, ''గురుభల్లూకా, తమరెక్కడ? మేం యిక్కడున్నాం!'' అంటూ నాలుగైదు సార్లు గట్టిగా కేకలు వేశారు.

ఆ కేకలు వింటూనే చెట్టు కిందవున్న వీరపుర ఆశ్వికులు అదిరిపడ్డారు. వాళ్ళ దళనాయకుడు చప్పున కత్తిదూసి తన అనుచరులతో, ''ఎవరా కేకలు పెట్టేది?



మనం ఆ మధ్య విన్న ఎలుగ్గొడ్డు ముఠా వాళ్ళలా వున్నారు. మన ప్రాణాలకు ఇదొక కొత్త బెడద! రండి!'' అంటూ గుర్రం ఎక్కి భల్లూకుడి శిష్యులున్న వైపుకు పరిగెత్తించాడు.

ఆశ్వికులు తమను సమీపించటం చూస్తూనే భల్లూకుడి శిష్యులిద్దరూ చేతుల్లోవున్న ఈటెలను కింద పడవేసి, ''అయ్యా, మమ్మల్ని చంపకండి, లొంగిపోతున్నాం. మా గురువును శత్రువులు పట్టుకున్నట్టున్నది. ఇంక మేం ఎవరి కోసం బతకటం!'' అన్నారు.

ఆశ్విక దళనాయకుడు ఆశ్చర్యపడి పోతూ, ''మీ గురువును శత్రువులు పట్టుకున్నారా? ఎవరా శత్రువులు?'' అని అడిగాడు.

ఆ ప్రశ్నకు భల్లూక శిష్యుల్లో ఒకడు, ''అయ్యా, ఈ రోజు కొంచెం పొద్దెక్కాక ఒంటెల మీద స్వారీచేసే జనం కొందరు హఠాత్తుగా వచ్చి మా బిలదుర్గంలో జొరబడ్డారు. ఆ సమయంలో మేమందరమూ దేవీపూజలో నిమగ్నులమై వున్నందున వాళ్ళను ఎదిరించి పోరాడలేక పోయాం. ఆ దుర్మార్గులు మాలో కొందరిని చంపారు. వాళ్ళకు దొరక్కుండా తప్పించుకున్న వాళ్ళం మా గురువుతో పాటు అరణ్యంలోకి పారిపోయి వచ్చాం. కాని, మా గురువు మా నుంచి వేరుపడి ఎటో పోయాడు.'' అన్నాడు దిక్కులుచూస్తూ.

ఒంటెల మీద వచ్చిన వాళ్ళనే సరికి దళనాయకుడికి, వాళ్ళు కొండకోట నుంచి పారిపోయిన స్వర్ణాచారీ, అతడి అనుచరులూ అన్న నమ్మకం కలిగింది. అతడు వెంటనే ఇద్దరు ఆశ్వికుల్ని కొండకోటకు పొమ్మని ఆజ్ఞాపించి, ''సేనానితో శత్రువులు యీ ప్రాంతాలవున్న బిలదుర్గంలో వున్నారని చెప్పండి. ఆయన సైన్యంతో రాగానే అందరం అక్కడికి పోదాం,'' అన్నాడు.

ఆశ్వికులిద్దరూ గుర్రాలను అదిలించి కొండకోట కేసి పరుగు తీశారు. దళ

నాయకుడు భల్లూకుడి శిష్యులతో, "మీరు మా శత్రువు లెక్కడవున్నదీ చెప్పి చాలా సాయం చేశారు. సేనాని రాగానే మీకు తగిన బహుమతి యిప్పిస్తాను," అన్నాడు.

బహుమతి మాట వింటూనే శిష్యు లిద్దరూ అయిష్టంగా తలలాడించి, "అయ్యా, దేవీఉపాసకుల మైన మాకు మీ బహుమతు లెందుకు? మా గురువు గారు క్షేమంగా మా కంటబడితే అంతే చాలు. సెలవు, వస్తాం!" అంటూ బయలుదేరారు.

దళనాయకుడు చప్పున గుర్రం మీంచి వంగి ఒక శిష్యుడి భుజం గట్టిగా పట్టుకుని, "ఆగండి! ఎక్కడికి పోతున్నారు? మీరు చెప్పే ఆ బిలదుర్గం ఎక్కడో మా కెలా తెలుస్తుంది? దాన్ని చూపే బాధ్యత మీది, తెలిసిందా?" అన్నాడు కోపంగా.

"అయ్యా, ఆ బిలదుర్గం యీ దాపులనే వున్నది. అక్కడికి వెళ్ళేందుకు మీకు దారి చూపుతాం. ఒక వేళ ఆ దుర్గంలో ఒంటెల వాళ్ళకు మా గురువైన భల్లూకుడు బందీగా పట్టుబడి వుంటే, ఆయన్ని విడిపించేందుకు సాయం చేయాలి," అన్నాడు భల్లూక శిష్యుడొకడు.



"ఆ దుర్గాన్ని వశపరుచుకుని అక్కడున్న వాళ్ళలో రాజద్రోహు లెవరో, కాని వాళ్ళెవరో నిర్ణయించేది నేను కాదు, మా సేనానాయకుడు. త్వరలోనే అయన యిక్కడికి వస్తాడు. అందరం ఆ బిల దుర్గానికి కలిసిపోదాం. మీరీ చెట్టు కిందే నిలబడండి," అని ఆజ్ఞాపించాడు దళనాయకుడు.

ఇద్దరు అశ్వికులు వచ్చి ఒంటెల వాళ్ళు ఒకానొక బిలదుర్గంలో దాక్కొని వున్నారని చెప్పగానే వీరపుర సేనాని ఎక్కడలేని ఆనందంతో, "ఆ రాజద్రోహు లందరూ కలిసి కట్టుగా ఒకే చోట వున్నారన్న మాట! అందర్నీ వీలయితే



మిగిలిన శిష్యులనూ తీసుకుని ముందు గానే బిలదుర్గం దగ్గిరకు చేరాడు.

కొద్ది సేపటికల్లా వీరపుర సేనాని, దళనాయకుడున్న ప్రదేశానికి వచ్చాడు. దళనాయకుడు అతడికి గురుభల్లూకుడి శిష్యులను చూపించి, వాళ్ళు చెప్పిన దంతా చెప్పి, "అయ్యా, ఆ రాజద్రోహు లందరూ మనం వేయబోతున్న ఉచ్చులో చిక్కినట్టే!" అన్నాడు ఉత్సాహంగా.

సేనాని, భల్లూకుడిశిష్యుల కేసి కత్తి ఝుళిపిస్తూ, "ఒరే, ఎలుగ్గొడ్డు వెధ వల్లారా! మీరు చెపుతున్నదంతా నిజమా లేక యిందులో మీ గురువుగాడి జిత్తులు గాని, ఆ ఒంటె దుర్మార్గుల ఎత్తుగడలు గాని ఏమైనా వున్నవా?" అని అడిగాడు.

భల్లూకుడి శిష్యులు, సేనాని కత్తి చూసి ఏమీ బెదరక, "మహాప్రభో, మేము వృకేశ్వరీదేవి ఆనగా చెపు తున్నాం. మేం చెప్పిన దాంట్లో ఆవ గింజంత అబద్ధం కూడా లేదు. ఆ బిల దుర్గాన్ని తమరు తిరిగి మా గురువుగారి పరం చేయాలి," అంటూ నమ్మబలికారు.

"ముందు ఆ బిలంలో చేరిన పంది కొక్కుల్ని బయిటికి లాగనీయండి; దాన్ని ఎవరి పరం చేయాలో ఆలోచిస్తాను," అని సేనాని, సైనికులతో, "మీరంతా నిశ్శబ్దంగా ఆ బిలదుర్గాన్ని చేరాలి.

ప్రాణాలతో పట్టుకుని, తాళ్ళతో బంధించి వీరపుర రాజవీధుల్లో ఊరేగిస్తాను. తర వాత వాళ్ళకు ఉరి ఎలానూ తప్పదు. ఇది ముందు ముందు కాబోయే రాజ ద్రోహులకు గుణపాఠంగా వుంటుంది." అన్నాడు.

ఇలా అని సేనాని కొందరు అశ్వి కుల్నీ, కాల్బల సైనికుల్నీ వెంట బెట్టు కుని దళనాయకుడున్న చోటుకు బయలుదేరాడు. భల్లూకుడి శిష్యుల మాటలు నమ్మి వీరపుర సైనికులు తప్పక బిలదుర్గం ముట్టడించేందుకు వస్తారని ఊహించిన ఖడ్గ జీవదత్తులు, సమరబాహునూ, గురుభల్లూకుణ్ణీ, వాడి

ఒరే, ఎలుగ్గొడ్డు మూర్ఖుల్లారా! మీరు ముందుండి ఆ చోటుకు దారితీయండి. ఇందులో ఏదైనా మోసం వున్నదో మిమ్మల్ని అక్కడికక్కడే ముక్కలుగా నరికేస్తాను,'' అన్నాడు.

ముందు భల్లూకుడి శిష్యులిద్దరూ దారి చూపుతూండగా, సేనానీ, సైనికులూ పావు గంటకాలం గడిచీ గడవకముందే బిలదుర్గాన్ని చేరారు. ఆ సమయంలో బిలదుర్గం పైన నరమానవుడంటూ లేడు; చుట్టూ ఎత్తయిన చెట్లూ, ముళ్ళపొదలూ వున్నాయి. అంతా నిశ్శబ్దంగావుంది.

సేనాని గుర్రం మీంచి దిగి బిలదుర్గం ముందుకు పోయి, దిగువకు తొంగి చూస్తూ, పెద్ద గొంతుతో, ''ఒరే, బిలంలో వున్న శత్రువుల్లారా, పైన నేను—వీరపుర సేనానిని పెద్ద సైన్యంతో వచ్చివున్నాను. రెండు మూడు నిమిషాల్లో మీరందరూ ఆయుధాలు బిలంలోనే వదిలి, వట్టి చేతులతో పైకివచ్చి, లొంగిపోకపోతే, నేను బిలంలోకి దిగి మిమ్మల్ని చిత్రవధ చేస్తాను,'' అని కేకవేశాడు.

బిలంలో నుంచి ఎలాంటి జవాబూ రాలేదు. సేనాని రెండు మూడు నిమిషాలు చూసి కోపంతో పళ్ళు కొరుకుతూ, తన గుర్రపు రౌతులందర్నీ, గుర్రాలను చెట్ల కింద మందవేసి కాపలా పెట్టి తన



దగ్గిరకు రమ్మన్నాడు. వాళ్ళు అలా చేసి రాగానే, వాళ్ళతో పాటు కాల్బల సైనికుల్ని కూడా వెంటబెట్టుకుని బిలం లోకి దిగుతూ, భల్లూకుడి శిష్యులను, ''ఒరే, మీరిద్దరూ బిలంలోని దారి మార్గాలు తెలిసినవాళ్ళు, ముందుండి దారితీయండి,'' అని ఆజ్ఞాపించాడు.

భల్లూకుడి శిష్యులిద్దరూ అందుకు అభ్యంతరం చెప్పకుండా బిలంలోకి ప్రవే శించారు. వాళ్ళ వెనగ్గా సేనానీ, సైని కులూ లోపలికి దిగారు. వాళ్ళంతా ఆ విధంగా బిలంలోకి మాయంకాగానే, హఠాత్తుగా పొదలచాటు నుంచి నలుగురు ఎలుగ్గొడ్డు వాళ్ళు బయటికి వచ్చి,

గుర్రాలకు కాపలావున్న ఇద్దరు వీరపుర సైనికుల మీద పడ్డారు. సైనికులు కేకలు వేసే లోపలే ఎలుగ్గొడ్డు వాళ్ళు, వాళ్ళను ఈటెలతో పొడిచి, నేలపడి గిలగిల తన్నుకుంటున్న వాళ్ళిద్దర్నీ భుజాలమీద వేసుకుని దూరంగా వున్న గచ్చపొదల వెనకాల పడవేశారు.

ఆ సమయంలో జీవదత్తుడు, సమరబాహూ, గురుభల్లూకుడితో పాటు అక్కడికి వచ్చి, "భల్లూకా! నీ శిష్యులు ఆ కాపలా వాళ్ళను అంత ఘోరంగా చంపవలసింది కాదు. కాళ్ళూ, చేతులూ కట్టి ఆ పొదల చాటున పడవేస్తే సరిపోయేది కదా?" అన్నాడు.

గురుభల్లూకుడు ఆ మాటకు జవాబివ్వకుండా, అపరాధం చేసినవాడిలా తలవంచుకు పూరుకున్నాడు. సమరబాహు గుర్రాల కేసి చూసి ఉత్సాహంగా, "జీవదత్తా, నా అనుచరులు స్వారి చేసేందుకు ఒంటెలతో పాటు గుర్రాలు కూడా లభ్యమయినై," అన్నాడు.

"అప్పుడే మనం శత్రుసంహారం చేసినట్టు సంతోష పడకు, సమరబాహూ. వీరపుర సేనానిని ప్రాణాలతో ఎలా పట్టుకోవాలన్నదే గడ్డు సమస్య. బిలంలో వున్నవాళ్ళను హడల కొట్టేందుకు ఉపయోగిస్తుంది; ఎండు కట్టెల్ని కొన్నిటిని కాల్చి బిలద్వారం దగ్గిరకు తెమ్మని నీ వాళ్ళకు చెప్పు," అన్నాడు జీవదత్తుడు.

ఎలుగ్గొడ్డు వాళ్ళూ, సమరబాహు అనుచరులూ ఆ చుట్టుపక్కల దొరికిన ఎండు పుల్లల్ని పోగుచేసి బిలద్వారం అంచున వేసి నిప్పు ముట్టిస్తూండగా, జీవదత్తుడు బిలంలోకి తొంగిచూస్తూ, "ఓటి, వీరపుర సేనానీ! నువ్వూ, నీ సైనికులూ ఆయుధాలను బిలంలోనే వదిలి రెండు మూడు నిమిషాల్లో బయిటికి రావాలి. అలా చేయకపోయావో, రాజు సమరబాహు సైనికులూ, ఆటవికులూ బిలంలోకి దిగి మీ అందర్నీ చిత్రవధ చేస్తారు!" అని కేకవేశాడు. —(ఇంకావుంది)






# పురుషద్వేషి

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, నువు చేస్తున్న ఈ పని చూస్తే విశ్వమిత్రుడి లాగా నువు కూడా స్త్రీ ద్వేషానికి గురి అయావా అని అనుమానం కలుగుతున్నది. శ్రమ తెలియకుండా నీకు విశ్వమిత్రుడి కథ చెబుతాను, విను.'' అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం శ్రీపురంలో విశ్వమిత్రు డనే ధనసంపన్నుడైన యువకుడు ఉండేవాడు. అతను విశాల హృదయమూ, ఉదార స్వభావమూ కలవాడు. అతనికి యుక్తవయసు రాకముందే పెద్దలెవరూ మిగలకుండా పోయిన కారణం చేత, బంధువులూ, స్నేహితులూ అతన్ని కని



పెట్టి ఉండి, పెళ్ళి యీడు రాగానే పొరుగూళ్ళో ఒక అందమైన పిల్లను చూసి పెళ్ళిచేసి, అతన్ని ఒక ఇంటివాణ్ణి చేసి, తమ బాధ్యత నిర్వర్తించారు.

విశ్వమిత్రుడి భార్య మిత్రవింద అందమైనదే గాని, భర్తకు అనుకూలవతి కాదు. ఆమె తన భర్తను చూసి చిరాకు పడుతూనూ, చీదరించుకుంటూనూ ఉండేది. అతను దగ్గిరికి వస్తేనే ఆమెకు తేళ్ళూ జెర్రులూ పాకినట్టు ప్రవర్తించేది. తన భార్య అంద చందాలకు మురిసి పోయిన విశ్వమిత్రుడు మొదట్లో, ఆమెకు తల్లి దండ్రులు ఇష్టంలేని సంబంధం చేశారనుకున్నాడు. కాని ఇది పొరపాటని ఆమె మాటలలో తేలి పోయింది. ఆమె ద్వేషం తన భర్త మీద మాత్రమే కాదు, మగజాతి అంటేనే ఆమెకు చెప్పరానంత అసహ్యం.

"మగవాళ్ళు ఆడవాళ్ళ పాలిటి పిశాచాలు! బుద్ధిగల ఏ ఆడదీ పెళ్ళాడరాదు. నేను పెళ్ళి వద్దు మొర్రో అంటూంటే వినిపించుకోకుండా మా వాళ్ళు నాకు పెళ్ళి చేశారు," అన్నది మిత్రవింద ఒకసారి.

ఆ మాట విన్నాక విశ్వమిత్రుడికి కొంత ఆశకలిగింది. మగవాళ్ళందరూ భార్యల పట్ల పిశాచాల లాగా ప్రవర్తించరనీ, తాను తన భార్యను ఎంతైనా సుఖపెట్ట గలడనీ తెలిసి వస్తే ఆమె మారుతుందను కున్నాడు అతను. దాంపత్య సుఖం అనుభవమైన మీదట ఆమె మనస్తత్వం మారుతుందన్న ఉద్దేశంతో అతను బలాత్కారంగా ఆమెతో దాంపత్య జీవితం గడిపాడు.

కాని అతని ఆశ ఫలించ లేదు. దాంపత్య సుఖం మిత్రవిందను ఏ మాత్రమూ మార్చలేక పోయింది. ఆమె అతన్ని పూర్వంలాగా చీదరించుకుంటూనే వచ్చింది.

ఇంతలో ఆమె గర్భవతి అయినట్టు రూఢి అయింది. పిల్లలను కని మాతృ

త్వం అనుభవంలోకి వస్తే ఆమె తప్పక మారుతుందనుకున్నాడు విశ్వమిత్రుడు. కాలక్రమాన మిత్రవింద కవల పిల్లలను కన్నది. కాని ఆమెలో ద్వేష భావం తగ్గటానికి బదులు పెరిగిపోయింది. అసలే మొగుడితో రోతపడుతున్న తనకు దిక్కుమాలిన పిల్లలు కూడా దాపురించారని ఆమె వాపోయింది.

ఇక విశ్వమిత్రుడికి తన భార్య బాగుపడి, అనుకూలవతిగా మారుతుందన్న భ్రమ తొలగిపోయింది. అతను భార్యకు గాని, మిత్రులకు గాని చెప్పకుండా ఇల్లు విడిచి అడవులను బట్టి పోయాడు.

అడవి మార్గంలో విశ్వమిత్రుడికి శత వృద్ధుడైన సిద్ధుడు ఒకడు కనిపించి,

''నాయనా, నీకు తొందర పని ఏమీ లేకపోతే ఒక్క ఘడియ ఆగు. ఈ లోపల నేను దేహం చాలించబోతున్నాను. నాకు తెలిసిన కామరూపవిద్యను నీకు దానం చేస్తాను. అందుకు బదులుగా నా కళేబరానికి దహనసంస్కారాలు చేసి, నీ దారిన నువు వెళ్ళు,'' అని కోరాడు.

విశ్వమిత్రుడు ఆయనకు దహన సంస్కారం చెయ్యటానికి ఒప్పుకున్నాడు. సిద్ధుడు అతనికి కామరూపవిద్య నిచ్చి ప్రాణాలు వదిలాడు. విశ్వమిత్రుడు అక్కడే చితి పేర్చి, సిద్ధుడి కళేబరాన్ని దహనం చేస్తూ చితి వద్ద నిలబడి ఉండగా అతనికి ఒక ఆలోచన వచ్చింది.





వెంటనే అతను తిరుగు ముఖం పట్టి శ్రీపురానికి వచ్చేశాడు.

అతను ఊరు చేరేసరికి చాలా రాత్రి అయింది. అతను తన విద్యతో ఆడదాని రూపం ధరించి, తన ఇంటికి ఎదురుకుండా ఉండే దేవదత్తు డనే యువకుడి ఇంటి తలుపు తట్టాడు.

నిద్రాభంగమైన దేవదత్తుడు నిద్ర మత్తులో వచ్చి తలుపు తీసి చూసేసరికి, అప్సరసలాటి ఆడది కనిపించగానే అతని నిద్రమత్తు అంతా వదిలిపోయింది.

"నా పేరు సుమిత్ర. మాది దూర దేశం. నేను నా తల్లిదండ్రుల వెంట ఈ దేశం వస్తుంటే దారిలో దొంగలు మమ్మల్ని దోచుకుని, నా తల్లిదండ్రులను చంపేశారు. నేను ఎలాగో ప్రాణాలతో తప్పించుకుని ఇలా వచ్చాను. ఈ రాత్రికి ఆశ్రయం ఇయ్యగలరా?" అని అడిగాడు స్త్రీ రూపంలో ఉన్న విశ్వమిత్రుడు.

"అలాగే ఇస్తాను. కాని రేపు మాత్రం నీకు ఎవరుంటారు? ఎక్కడికని పోతావు? నేను నిన్ను పెళ్ళి చేసుకుంటాను. నువు ఇక్కడే ఉండిపో," అన్నాడు దేవదత్తుడు.

అందుకు సుమిత్ర ఒప్పుకున్నది. మర్నాడు వారిద్దరికి శాస్త్రోక్తంగా వివాహం అయింది. త్వరలోనే మిత్రవిందకూ, సుమిత్రకూ స్నేహం కలిసింది. సుమిత్రకు మిత్రవింద పిల్లలంటే అమితమైన ఇష్టం; ఎప్పుడూ వాళ్ళను ముద్దు చేసి, ఆడించేది. ఆ కవల పిల్లలు కూడా తల్లి మీద కన్న, ఎదురింటి సుమిత్ర మీద ఎక్కువ ప్రేమ చూపేవారు.

సుమిత్ర తన మొగుణ్ణి గురించి ఆపేక్షగా మాట్లాడటమూ, పిల్లలంటే ప్రాణం ఇవ్వటమూ చూసి మిత్రవింద ఆశ్చర్యపడింది. క్రమంగా ఆమెలో ఏదో మార్పు రావటం సుమిత్ర కనిపెడుతూ వచ్చింది. ఆమె ఇప్పుడు తన పిల్లల నుంచి కొంత ఆనందం పొందుతూ వస్తున్నది.

ఒకసారి సుమిత్రతో ఆమె, "నీ జీవితం పుష్పించిన చెట్టులాగా ఉన్నది. కాని నా జీవితం మోడు చెట్టు!" అని నిట్టూర్చింది.

అప్పుడు సుమిత్ర, "అన్నట్టు, అడుగుదామనుకుని మరిచిపోతున్నాను. నీ పిల్లల తండ్రి ఏ దేశం వెళ్ళాడు? ఎప్పుడు తిరిగి వస్తాడు?" అని అడిగింది.

వెంటనే మిత్రవింద కళ్ళ నీళ్ళు పెట్టుకుని, "నా వంటి ఎండు కట్టెతో ప్రాణం విసిగి, ఆయన ఇల్లు విడిచి పోయారు. ఇంక వచ్చేదేమిటి?" అన్నది.

తన భార్య మనసు పూర్తిగా మారిందని నమ్మకం కుదిరినాక, సుమిత్రగా ఉన్న విశ్వామిత్రుడు తన కామరూప విద్యతో తిరిగి మామూలు మనిషి అయి తనకు జరిగినదంతా చెప్పి, "ఆడదానికి భర్త సుఖమూ, పిల్లల మీది ప్రేమా అంతులేని ఆనందం ఇస్తాయని స్వానుభవంతో తెలుసుకున్నాను!" అన్నాడు.

మిత్రవింద ఆనంద బాష్పాలు రాలుస్తూ, అతని కాళ్ళ మీద పడి, "అందరు ఆడవాళ్లూ నాలాగా ఉంటారని ఎందుకు అనుకున్నారు? నా మూలంగా మీరు అడవులు పట్టి పోకుండా, మరొకతెను పెళ్ళాడి ఉంటే మీకు చాలా కష్టాలు తప్పేవి." అన్నది.



"లేదు, లేదు! ఇంకొకతెను పెళ్ళాడాలనుకుంటే అడవుల కెందుకు పోతాను? నేను ఆ పని చెయ్యటానికి కారణం నువు కాదు, నిన్ను మార్చలేకపోయినందుకు నాలో కలిగిన విరక్తి! నేను భార్యగా కోరింది నిన్నే, కాని నువు ఉండిన విధంగా కాదు," అన్నాడు విశ్వామిత్రుడు.

అటు తరవాత వారిద్దరూ ఛాలా అన్యోన్యంగా జీవించారు. మిత్రవింద తన వంటి అదృష్టవంతురాలు ప్రపంచంలో మరొకతె ఉండదనుకున్నది.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, సృష్టిలో ఎన్నో ఆనందమయ రూపాలు ఉండగా విశ్వామిత్రుడు ఏరి కోరి స్త్రీ రూపం

ఎందుకు ధరించాడు? ధరించిన వాడు తన ఇంటి సమీపానికే ఎందుకు వచ్చాడు? పురుషులలో కొత్తగా మంచి ఏమీ చూడ కుండానే మిత్రవింద తన పురుష ద్వేషాన్ని ఎలా మార్చుకున్నది? ఈ ప్రశ్నలకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలి పోతుంది.'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''స్త్రీ పురుషులు ఒకే జీవితంలో భాగస్వాములు. వాళ్ళు ఒకరి నొకరు ప్రేమించు కోవటానికి కారణం కూడా వారి ఉమ్మడి జీవితమే. ఆ జీవితంలో ఎలాటి లోపమూ లేనప్పుడు స్త్రీకి పురుషద్వేషమూ, పురుషుడికి స్త్రీ ద్వేషమూ రాదు. మిత్రవింద పురుష ద్వేషిణి అనటం పొరపాటు, ఆమె స్త్రీ ద్వేషిణి కూడానూ. అందుకే ఆమెకు వివాహ మంటే ఇష్టం లేదు. స్త్రీలకు సహజంగా ఇష్టమయే దాంపత్య జీవిత మంటేనూ, మాతృత్వ మంటేనూ ఇష్టం లేదు. ఆమెలో స్త్రీ ద్వేషం ఉన్నదని తెలియక, విశ్వమిత్రుడు ఆమెను స్త్రీగా ఆనంద పరచాలని చూసి విఫలు డైనాడు. స్త్రీకి సహజంగా పురుషద్వేషం ఉంటుందో ఉండదో చూడటానికే అతను స్త్రీ రూపం ధరించాడు. స్త్రీ జీవితంలో ఆనందం ఉండే పక్షంలో దాన్ని తన భార్య చూడగలందులకు అతను తన ఇంటి ప్రాంతానికే వచ్చాడు. స్త్రీకి సహజంగా భర్తపైనా, పిల్లలపైనా ద్వేషం ఉండదని అతనికి తెలిసింది. మిత్రవిందలో కలిగిన పరివర్తన కూడా స్త్రీ ద్వేషం పోవటం ద్వారానే జరిగింది. ఆమె సుమిత్రను చూసి స్త్రీ జీవితం మీద రోత పోగొట్టుకున్నది. ఆమెలో స్త్రీ ద్వేషం పోగానే పురుష ద్వేషం కూడా పోయింది.'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు.

—(కల్పితం)



# మంచి మిత్రుడు

ఒక ధనికవర్తకుడికి ఒక కొడుకుండేవాడు. వాడి చుట్టూ పనికిమాలిన స్నేహితులు చేరారు. ఇది గ్రహించి తండ్రి తన కొడుకును అడ్డమైన వాళ్ళతోనూ స్నేహం చెయ్యవద్దని చాలాసార్లు హెచ్చరించాడు. కాని కొడుకుకు తన కపట స్నేహితుల మీద ఎంతో నమ్మకం; అంచేత వాడు తండ్రి మాటలు వినిపించుకోలేదు.

కొన్నాళ్ళకు వర్తకుడు తన కొడుక్కు గుణపాఠం నేర్పదలచి వాడితో, "నాయనా, మనం వర్తకం మీద దూరప్రయాణం పోవలసి వస్తుంది. మన రత్నాలు ఎవరి వద్ద దాస్తే బాగుంటుంది?" అన్నాడు. కొడుకు తన ఆప్త మిత్రుడి పేరు చెప్పాడు. తండ్రి అనుమతితో వాడు రత్నాల పెట్టెను తన మిత్రుడి వద్ద ఉంచాడు.

కొన్నాళ్ళు అయాక తండ్రి కొడుకులు వ్యాపారం ముగించుకుని తిరిగివచ్చారు. కొడుకు రత్నాల పెట్టెను తీసుకు రావటానికి తన మిత్రుడి వద్దకు వెళ్ళి కోపంగా తిరిగివచ్చి, "మీరు చేసిన అవమానానికి నా మిత్రుడు ఎంతో బాధ పడుతున్నాడు. మనం ఇచ్చిన పెట్టెలో అన్నీ రాళ్ళుట!" అన్నాడు.

తండ్రి నవ్వి, "ఆ పెట్టెలో ఏ మున్నదీ నీ మిత్రుడు ఎందుకు చూడవలిసి వచ్చింది? నిజంగా రత్నాలే ఉంటే ఏం చేసి ఉండే వాడో గ్రహించలేదా? నేను నా మిత్రుడి వద్ద కూడా ఒక రత్నాల పెట్టెను దాచాను. వెళ్ళి తీసుకురా!" అన్నాడు.

కొడుకు వెళ్ళి తండ్రి మిత్రుడి వద్దనుంచి రత్నాలపెట్టెను తెచ్చాడు. తెరిచి చూస్తే అందులోనూ రాళ్ళే ఉన్నాయి. మంచి మిత్రుడు ఎలా ప్రవర్తిస్తాడో కొడుక్కు అర్థమయింది.

—బసిరెడ్డి శ్రీనివాసులురెడ్డి







# కృషా బదాప్పు

కామయ్య ఎవరూ లేని ఒంటరిగాడు. చిన్నతనమంతా వాడు ఊళ్ళో వాళ్లకు ఈ పనీ, ఆ పనీ చేసిపెడుతూ, వాళ్ళు పెట్టినది తింటూ, ఎవరి పంచనో పడుకుంటూ గడిపాడు. వాడికి పెళ్ళి యీడు వచ్చింది; పెళ్ళి చేసుకుని ఒక ఇంటివాడు కావాలని బుద్ధి పుట్టింది. రంగయ్యమామ కూతురు బాగుంటుంది. ఆ పిల్లను పెళ్ళిచేసుకుందామనుకున్నాడు కామయ్య.

వాడు సరాసరి రంగయ్యమామ దగ్గరికి వెళ్ళి, ''మామా, నీ కూతుర్ని నాకిచ్చి పెళ్ళి చెయ్యి. ఒక ఇంటివాణ్ణి అవుతాను,'' అన్నాడు.

''తాడూ, బొంగరమూ లేని వాడికి పిల్లనియ్యను. చేతనయితే వందరూపాయలు ఓలి ఇచ్చి, నా కూతుర్ని తీసుకుపో,'' అన్నాడు రంగయ్యమామ.

"కొండల అవతల బోలెడంతకూలి ఇస్తారు. ఒక్క ఏడాదిలో వంద రూపాయలు సంపాదిస్తా,'' అన్నాడు కామయ్య.

''అయితే, సరిగా ఒక సంవత్సరం గడువిస్తా. వంద రూపాయలతో తిరిగిరా,'' అన్నాడు రంగయ్యమామ.

ఆ రోజే బయలుదేరి కామయ్య కొండల అవతలికి వెళ్ళాడు. అక్కడ కూలి బాగా దొరుకుతుంది. సంవత్సరంలో వంద రూపాయలూ మిగల్చటం కండ గల వాడికి ఏమంత కష్టం కాదు.

కామయ్య ఒక షావుకారు వద్దకు వెళ్ళి, ''అయ్యా, నేను పొరుగూరు నుంచి కూలి చేసుకోవటానికి వచ్చాను. నన్ను మీ దొడ్లో పాకలో ఉండనియ్యండి," అని అడిగాడు. షావుకారు సరే నన్నాడు.

కామయ్య ఒక్క రోజన్నా విశ్రాంతి తీసుకోకుండా కూలి చేస్తూ, తన సంపా

కె. నాగేశ్వరరావు

దనను వెండి రూపాయలుగా మార్చుకుని, వాటిని ఒక ముంతలో వెయ్యసాగాడు. ప్రతి రాత్రీ వాడు నిద్రపోయే ముందు ముంతను చేతుల్లో పట్టుకుని పైకి కిందికీ ఊపి, అందులో ఎన్ని రూపాయలు చేరాయో గుర్తు తెచ్చుకుని, ఇంకా ఎన్ని వెయ్యాలో గుణించుకుని, ఆ తరవాత రంగయ్యమామ కూతుర్ని పెళ్ళాడటం గురించి కలలు కంటూ నిద్రపోయేవాడు.

సంవత్సరం పూర్తి కావచ్చింది. ముంతలో వంద వెండి రూపాయలూ చేరాయి.



కామయ్య, తనకు పాక యిచ్చిన షావుకారు వద్దకు వెళ్ళి, "అయ్యా, నేను మా ఊరికి తిరిగి పోతున్నాను. శల విప్పించండి," అన్నాడు.

"ఏ మాత్రం సంపాదించావు? మా ఊరు వచ్చిన కూలి వాళ్ళు కుబేరులవుతారులే!" అన్నాడు షావుకారు.

కామయ్య తన మూటలో నుంచి ముంత పైకి తీసి, "ఎంత లెండి? వంద రూపాయలు," అన్నాడు.

షావుకారుకు ముంతలో ఉన్న డబ్బు మాట వినగానే దురాశ పుట్టింది. ఆయన కామయ్యతో, "కామయ్యా, నువ్వింత పని చేస్తావా? ఊరికి కొత్తవాడి వని పాకలో ఉండనిస్తే మా ఇంట్లో ముంత కాస్తా కాజేస్తావా? రాజుగారి దగ్గిర ఫిర్యాదు చేస్తాను, పద," అన్నాడు.

షావుకారు తెచ్చిన ఫిర్యాదు విని, రాజు కామయ్యను, "నువు ఈ డబ్బు సంపాదించావా? దొంగిలించావా?" అని అడిగాడు.

"మహారాజా, నేను కొండల అవతలి నుంచి ఇక్కడికి వచ్చినది సంపాదించటానికే, దొంగతనాలు చెయ్యటానికి కాదు. కష్టపడి కూలిచేసి మిగుల్చుకుని, వంద వెండి రూపాయలు ఎంచి ఈ ముంతలో వేసుకున్నాను," అన్నాడు కామయ్య.

"అబద్ధం! నేను మా ఆవిడకు నగ చేయించాలని సరిగా వంద రూపాయలు ఈ ముంతలో వేసిపెట్టాను. మాటల సందర్భంలో ఈ సంగతి విని వీడు ఈ ముంతను దొంగిలించాడు," అన్నాడు షావుకారు.

రాజు ఎవరి మాట నమ్మాలో నిర్ణయించలేక పోవటం చూసి మంత్రి, "ఆ ముంత ఇలా ఇయ్యండి, రేపు సభలో మీ తగాదా తీర్చుతాం," అన్నాడు.

ఆ రాత్రి ఆయన అలాటి ముంతలే మరికొన్ని తెప్పించి, కొన్నిటిలో వందకు కొంచెం తక్కువగానూ, కొన్నిటిలో కొంచెం ఎక్కువగానూ వెండి రూపాయలు పోసి ఉంచాడు. తరవాత ఆయన కామయ్య ముంతను మిగిలిన వాటితో కలిపి పెట్టేశాడు.

మర్నాడు సభలో మంత్రి ముంతలన్నిటినీ ఒక బల్ల మీద ఉంచి, "షావుకారుగారూ, వీటిలో మీ ముంతను గుర్తించగలరా?" అని అడిగాడు.

"అన్నీ ఒక విధంగానే ఉన్నాయి. ఎలా గుర్తించటం?" అన్నాడు షావుకారు.

మంత్రి కామయ్యను కూడా అలాగే అడిగాడు.

కామయ్య ముందుకు వచ్చి, ఒక్కొక్క ముంతనే తీసుకుని చేతుల్లో పట్టుకుని పైకీ, కిందికీ ఊపి, "మహారాజా, ఇదే నా ముంత! ఇందులో సరిగా వంద వెండి రూపాయ లున్నాయి. మిగిలిన వాటిల్లో వందకు ఎక్కువా, తక్కువా ఉన్నాయి," అన్నాడు.

ముంతలోని రూపాయలు తీసి ఎంచితే సరిగా నూరే ఉన్నాయి. కామయ్య నిర్దోషి అని తేలిపోయింది. శ్రమబరువు శ్రమ చేసుకునే వాడికే తెలుస్తుంది, కూర్చుని సంపాదించేవాడికి తెలియదు. రాజుగారు షావుకారు చేత కామయ్యకు రెండు వందల రూపాయలు పరిహారంగా ఇప్పించాడు. కామయ్య ఆ డబ్బంతా తీసుకుని పోయి, రంగయ్యమామ కూతుర్ని పెళ్ళాడి సుఖంగా ఉన్నాడు.



# తమ్ముడి వాటా

ధర్మపురిలో ధర్మాత్ముడైన ఒక రాజు ఏటేటా ప్రజలకు అన్నవస్త్రాలు దానం చేస్తూ ఉండే వాడు. ఆ సమయంలో ఆయన సభచేసి, తాను ఏ విధంగా పరిపాలన సాగిస్తున్నదీ ప్రజలకు వివరించి చెప్పి, "ప్రజలందరూ నా సహోదరులు. నా సొత్తు అంతా ప్రజలదే," అనేవాడు.

ఇది విన్న ఒక మనిషి రాజసభకు వచ్చి, "నేను రాజుగారికి ఒక తమ్ముణ్ణి. రాజు గారిని చూడాలి," అన్నాడు.

రాజు అతన్ని సభలోకి రప్పించి, "ఏమిటి సంగతి?" అని అడిగాడు.

"మీ ప్రజలలో నేనూ ఒక తమ్ముణ్ణి. మీ సొత్తులో నా వాటా అడిగి తీసుకుపోదామని వచ్చాను," అన్నాడు ఆ మనిషి.

రాజు గణకులను పిలిపించి, "మన రాజ్యంలో ఉన్న జనసంఖ్య ఎంతో, మన ఖజానాలో ఎంత డబ్బున్నదో, అది అందరికీ పంచితే ఒక్కొక్కడికీ ఎంత వస్తుందో లెక్క కట్టండి," అన్నాడు.

గణకులు లెక్కకట్టి ఒక్కొక్క పౌరుడికీ అరదమ్మిడీ వస్తుందన్నారు.

"పోనీలెండి. ఈ మనిషికి ఒక దమ్మిడీ ఇచ్చిపంపండి," అన్నాడు రాజు.





# పూరీలశాసనం

ఒక సారి గోలకొండ నవాబు వేటకు వెళ్ళి, ఒక లేడిని తరుముతూ దట్టమైన అరణ్యంలోకి ప్రవేశించాడు. అతని పరివారం నవాబు గుర్రంతో సమానంగా కదలలేక వెనకబడి పోయారు.

మిట్టమధ్యాన్న మయింది. నవాబుకు దాహం వేసింది. ఎక్కడా నీరు కనిపించ లేదు. అలసి ఉన్న గుర్రం మీద అలాగే పోతూ నవాబు, "అల్లా, నే నివాళ దాహంతో చావక తప్పదా ?" అనుకున్నాడు.

అంతలో అతనికి దూరాన పక్షులు ఎగురుతూ కనిపించాయి. అక్కడ నీరు ఉండవచ్చు ననుకుని నవాబు గుర్రాన్ని అటుగా నడిపించాడు. త్వరలోనే అతను ఒక గుడిని చేరుకున్నాడు. గుడి దగ్గిర చల్లని నీడనిచ్చే చెట్లు ఉన్నాయి. గుడి ముందు కొలను ఉన్నది.

నవాబుకు ప్రాణాలు లేచి వచ్చాయి. ఆయన చప్పున గుర్రం దిగి, తాను నీరు తాగి, గుర్రాన్ని కూడా తాగించి, చల్లని చెట్టు నీడన నడుము వాల్చాడు. బాగా బడలి ఉండటాన ఆయనకు వెంటనే నిద్రపట్టింది.

నవాబు నిద్ర లేచే సరికి సూర్యుడు అస్తమించాడు. తూర్పు నుంచి మసక చీకట్లు కమ్ముకు వస్తున్నాయి. ఆయన లేచి, కాళ్ళూ, చేతులూ, ముఖమూ కడుక్కొని, దైవప్రార్థన చేసే సరికి చీకటి పడనే పడింది. ఆ రాత్రి తాను అక్కడే గడపవలిసి ఉంటుందని అతనికి తోచింది. అందుచేత ఆయన దేవాలయం ముందున్న అరుగు మీద పడుకున్నాడు. కాని ఆయనకు ఆకలి దహించుకు పోతూ ఉండటం చేత కన్ను మూత పడలేదు.

వి. యజ్ఞరామయ్య

అంతలో ఆయనకు దూరంగా దీపం ఒకటి కనిపించింది. ఆ దీపం తన కేసి వస్తూ ఉండటం చూసి ఆయనకు భయం వేసింది. అయినా చేసేది ఏమీ లేక, ఆయన అల్లాను స్మరిస్తూ పడుకున్నాడు.

కొద్ది సేపట్లో ఆ గుడిపూజారి దీపంతో సహా అక్కడికి వచ్చి, నవాబు పరిస్థితి తెలుసుకుని, గుడిలోకి వెళ్ళి, పేల పిండిలో ఇంత బెల్లం కలిపి తెచ్చి, తినమని నవాబుకు ఇచ్చాడు.

నవాబు ఆ పేలపిండి తిని ప్రాణాలు నిలబెట్టుకుని, ఆ పూజారికి ఒక భూమిని ఇనాంగా రాసి ఇచ్చి, తరవాత వెళ్ళి పోయాడు.

ఈ సంగతి, ఆ భూమిని అనుకుని ఉన్న భూములు గల భూస్వామికి తెలిసింది. అతను తాను ఆక్రమించ దలచిన భూమి మరొకరిది కావటం సహించలేక, పూజారి వద్దకు వచ్చి, నవాబు రాసి ఇచ్చిన శాసనపత్రం తనకు ఇయ్యమన్నాడు.

పూజారి ఇయ్యనన్నాడు.

"నేను తినవలసిన పంటను నువు తింటావా? ఎలా తింటావో చూస్తాను." అంటూ భూస్వామి పూజారిని ఒక చెట్టుకు కట్టేయించి, తన నౌకర్ల చేత చావగొట్టించాడు. ఆ దెబ్బలకు తాళలేక,



పూజారి నవాబు రాసి ఇచ్చిన పత్రాన్ని తెచ్చి, భూస్వామికి ఇచ్చాడు.

భూస్వామి దాన్ని ముక్కలుగా చించి పూజారికి ఇచ్చి, మింగ మన్నాడు. పూజారి గత్యంతరం లేక వాటిని నమిలి మింగాడు.

కొన్నాళ్ళకు నవాబు ఆ దారినపోతూ, పూజారి జ్ఞాపకం రాగా, గుడి దగ్గిరికి వెళ్ళాడు. గుడి పక్కన ఒక గుడిసె ఉన్నది. అందులో నుంచి పూజారి పిల్లలు బయటికి వచ్చి ఆయనను వింతగా చూస్తూ నిలబడ్డారు. వాళ్ళు బక్కచిక్కి ఉన్నారు. వాళ్ళ బట్టలు చిరిగి, మాసి ఉన్నాయి.

వాళ్ళను చూసి నవాబుకు ఆశ్చర్యం కలిగింది. తాను ఇచ్చిన భూమి మీద వచ్చే ఆదాయం పూజారికి చాలటం లేదు కాబోలని ఆయన అనుకున్నాడు.

అంతలో, కట్టెలు కోసం వెళ్ళిన పూజారి నవాబు వచ్చినట్టు తెలుసుకుని, పరిగెత్తుకుంటూ వచ్చి, నవాబును పలకరించి, గుడిసెలోకి వెళ్ళి, బెల్లం కలిపిన పేలపిండి తెచ్చి, నవాబు కిచ్చాడు.

నవాబు ఆ పేలపిండి తిని, దాన్ని మెచ్చుకుని, "కాగితం తీసుకురా, ఇంకో ఇనాం రాసి ఇస్తాను," అన్నాడు.

"సర్కార్, నా దొక మనవి. కాగితం మీద రాసి ఇచ్చే ఇనాం నాకు వద్దు," అన్నాడు పూజారి.

"పోనీ, రాగిరేకు మీద రాయించమంటావా?" అని నవాబు అడిగాడు.

"వద్దు, సర్కార్. అది మింగటం మరీ కష్టం. మీరు రాయించే శాసనం పూరీల మీద రాయించండి," అన్నాడు పూజారి.

"అరె, దివానా, పూరీల మీద ఎవరైనా శాసనం రాస్తారా? శాసనం తినటానికి అనుకున్నావా?" అని నవాబు అడిగాడు.

"అవును, సర్కార్," అన్నాడు పూజారి.

"అరె, దివానా! ఎంత పొరపాటు పడ్డావు? దాన్ని తీసుకుపోయి తహశీల్దారుకు చూపిస్తే భూమి నీకు స్వాధీనం చేసే వాడు గద! అయితే నే నిచ్చిన భూమి నీ స్వాధీనం కాలేదన్న మాట," అన్నాడు నవాబు.

పూజారి జరిగినదంతా చెప్పాడు.

అంతా విని నవాబు మండిపడి, భూస్వామిని పిలిపించి, కొరడాలతో కొట్టించి, తాను పూజారికి ఇచ్చిన భూమిని పూజారికి స్వాధీనం చెయ్యమని తాఖీదు రాసి తహశీల్దారుకు పంపాడు.

ఆ విధంగా పూజారికి ఆ ఇనాం దక్కింది. దానితో అతను నాలుగు కాలాల పాటు సుఖంగా జీవించాడు.





# ప్రసన్నాంజనేయం



ఒక చిన్న పల్లెలో ఒక బీద కుటుంబం ఉండేది. వారి జీవనం తోలుబొమ్మలు ఆడించటం. అందువల్ల వచ్చే ఆదాయంతో ఆ కుటుంబం అంతా జీవించాలి. ఆ కుటుంబంలో ఇద్దరు దంపతులూ, ఇద్దరు ముసలివాళ్లూ, నలుగురు పిల్లలూ ఉండేవాళ్ళు. పది రోజులకొక ఊరువెళ్లి, తోలుబొమ్మలను ఆడిస్తేనే గాని అందరికీ తిండి కూడా ఉండేది కాదు.

ఒక సారి ఈ కుటుంబం బొమ్మలూ, ఇతర సామానులూ సంచులు కట్టి తోలు బొమ్మలు ఆడించటానికి ఒక గ్రామానికి బయలుదేరింది. సామానులూ, సంచులూ మోస్తూ, పిల్లలతో సహా ప్రయాణం సాగించటంలో వాళ్ళు ఊరి పొలిమేర చేరేసరికి రాత్రి ఝాము పొద్దుపోయింది. అక్కడ ఒక చెరువూ, దాని పక్కన ఒక పెద్ద ఊడల మర్రిచెట్టూ కనిపించే సరికి, మూటలు విప్పి అందరూ భోజనాలు చేసి చెరువు నీరు తాగి, నిద్రపోయారు.

అర్థరాత్రివేళ అలికిడికి వాళ్ళు మేలుకున్నారు. సమీపంలోనే ఇళ్ళు కనిపించాయి. ఆ ఇళ్ళ దిక్కునుంచి కొందరు మనుషులు వచ్చి, తోలుబొమ్మల వాళ్ళను ఆట చూపమని కోరారు.

"పందిరి వెయ్యాలి. దీపాలు పెట్టాలి. దివిటీలు వెలిగించాలి. తెరలు కట్టాలి. ఈ అర్ధరాత్రివేళ ఇవన్నీ ఎలా సాధ్యపడతాయి? ఆట ఆడించలేం," అన్నారు తోలుబొమ్మలవాళ్ళు.

"మీకు కావలిసిన సదుపాయాలన్నీ మేం చేస్తాం. మీరు ఈ రాత్రి ఆట ఆడించాలిసిందే," అన్నారు వచ్చినవాళ్లు.

అన్నట్టే వాళ్ళు క్షణంలో అన్ని ఏర్పాట్లూ చేశారు. పందిరి తయారయింది. తోలుబొమ్మలాట ఆరంభమయింది. ఎవ

వేమూరు సుబ్రమణ్యం

రికి తోచిన డబ్బులు వారు వేయటానికి ముసలిది ప్రేక్షకుల దగ్గిర ఒక గుడ్డ పరిచింది.

పాటలు పాడుతున్నారు. డప్పులు వాయిస్తున్నారు. కేకలు పెడుతున్నారు. తెరమీద తోలుబొమ్మలు ఆడుతున్నాయి. దృశ్యం రావణాసురుడి లంకాపట్టణంలో రావణుడి కొలువు కూటం. రాక్షసులు అల్లరి చేస్తున్నారు. రాక్షస కాంతలు నృత్యాలు చేస్తున్నారు. ప్రేక్షకులు ఉత్సాహంగా నాటకం చూస్తూ, సంతోషంతో కేకలు పెడుతున్నారు.

రావణుడి కొలువు కూటం దృశ్యం అయిపోయింది. తెర మీదికి లంకిణి వచ్చింది. లంకిణిని చంపటానికి ఆంజనేయుడు వచ్చాడు. ఆంజనేయుడి అర్భాటంతోనూ, లంకిణి పడేపాట్లతోనూ ఆ ప్రదేశమంతా దద్దరిల్లి పోయింది. తెర వెనక కోలాహలం పెరిగింది గాని, తెర ముందు ప్రేక్షకుల కోలాహలం పూర్తిగా నిలిచిపోయింది.

ముసలమ్మ తెరముందుకు వచ్చి చూసే సరికి మైదానమంతా ఖాళీగా ఉన్నది. ప్రేక్షకులందరూ మాయమయారు. ముసలిది పరిచిన గుడ్డ మీద మాత్రం చాలా డబ్బు పడింది. ముసలిది వెనక్కు తిరిగి వెళ్ళి ఆట ఆపించింది.

అప్పుడు తోలుబొమ్మల వాళ్ళు వచ్చి చూస్తే, ముందు కనిపించిన ఇళ్ళు లేవు. తమను ఆడమన్న మనుషులుగాని, ఆట చూడ వచ్చినవాళ్ళు గాని ఒక్కరూ లేరు. ఇంత సేపూ తమ ఆట చూసినది దయ్యాలనీ, ఆంజనేయుడు తెర మీదికి రాగానే అందరూ పారిపోయారనీ తోలుబొమ్మల వాళ్ళు గ్రహించారు. ఎందుకైనా మంచిదని వాళ్ళు తెల్లవారినదాకా తెర మీద ఆంజనేయుణ్ణే ఆడిస్తూ కూర్చున్నారు.

ఏమైనా వాళ్ళు పడిన శ్రమ వృథా పోలేదు. బోలెడంత డబ్బుతోబాటు చాపలూ, దీపాలూ మొదలైనవి కూడా లభించాయి. దయ్యాల వల్ల హాని కలగకుండా ఆంజనేయుడు వారిని కాపాడాడు.





# కుదిరిన రోగం

ఒక ఊళ్లో పిసినిగొట్టు ధనికుడు ఉండే వాడు. అయితే అతను గొప్ప తిండి పోతు. తన మట్టుకు తాను పంచభక్ష్య పరమాన్నాలూ తినేవాడు. కాని ఇతరులకు ఎంగిలి చెయ్యికూడా విదిల్చేవాడు కాడు. అయనకు భార్యా, ఇద్దరు బిడ్డలూ ఉన్నారు; అయన వారిని కూడా కడుపు నిండా తిన నిచ్చేవాడు కాడు.

తిండియావ జాస్తిగా గల భద్రయ్యా నిత్యమూ ఏవో చిరుతిళ్ళు, పప్పులో, ఫలాలో తింటూనే ఉండేవాడు; ఆశగా తన వంక చూసే కన్న బిడ్డలకు అది మందు అని చెప్పేవాడు.

భద్రయ్యకు పొరుగున పాపయ్యా అనే ఒక పేదవాడు ఉన్నాడు. అతగాడికి కూడా భార్యా, ఇద్దరు పిల్లలూ ఉన్నారు. తనకు కలిగినంతలో అతడు భార్యా బిడ్డలతో సమంగా అనుభవిస్తూ ఉండేవాడు.

ఒక రోజు పాపయ్యా కొడుకు భద్రయ్యా ఇంటికి వెళ్ళాడు. ఆ సమయంలో భద్రయ్యా తన ఇంటి వరండాలో కూర్చుని, బత్తాయిపళ్ళు తింటున్నాడు. భద్రయ్యా పిల్లలిద్దరూ ఆశగా తండ్రి వంక చూస్తున్నారు. కాని అయన వాళ్ళ వంక చూడటం లేదు.

ఆయన దృష్టి పాపయ్యా కొడుకు మీద పడింది.

''ఎందుకురా ఇలా వచ్చావ్?'' అని భద్రయ్యా వాణ్ణి అడిగాడు చిరాకుగా.

''చంద్రాన్నీ, లక్ష్మినీ ఆడుకు నేందుకు తీసుకు వెళదామని!'' అని వినయంగా సమాధానం చెప్పాడు పాపయ్యా కొడుకు.

''పొండిరా! పోయి వాళ్ళింటో ఆడుకోండి,'' అన్నాడు భద్రయ్యా తన పిల్లలతో.

చంద్రమూ, లక్ష్మి పాపయ్యా కొడుకు వెంట వెళ్లారు. వాళ్ళు పాపయ్యా ఇల్లు

చేరినాక పాపయ్య కొడుకు భద్రయ్య కొడుకును, "అదేమిట్రా, మీకు పెట్టకుండా మీ నాన్న బత్తాయిపళ్లు తినేస్తున్నాడు?" అని అడిగాడు.

"అయనెప్పుడూ అంతే!" అన్నారు భద్రయ్య పిల్లలిద్దరూ ఏక కంఠంతో.

పాపయ్య కొడుకు లేచి, "మీ రిక్కడే ఉండండి. ఇప్పుడే వస్తా," అని భద్రయ్య పిల్లలకు చెప్పి, వైద్యుడు రంగనాథం ఇంటికి పరిగెత్తి వెళ్ళాడు.

పాపయ్య కొడుకు వెళ్లేసరికి రంగనాథం ఇంట్లోనే ఉన్నాడు. వాడు అయనకు నమస్కారం చేసి, "మా పొరుగింటి భద్రయ్యగారు చాలా జబ్బుగా ఉన్నారు. ఆయన డబ్బు ఖర్చు కొద్దీ వైద్యం చేయించుకోవడం లేదు. మీరు ఆయున్ను రక్షించాలి," అన్నాడు.

నిజంగానే, రంగనాథానికి ఎవరి జబ్బు గురించి విన్నా నిద్రపట్టదు. పాపయ్య కొడుకు చెప్పినది వింటూనే అయన లేచి, మందుల సంచీ తీసుకుని భద్రయ్య ఇంటికి వెళ్ళాడు.

రంగనాథం వెళ్ళేసరికి భద్రయ్య వరండాలో కుర్చీలో కూర్చుని ఉన్నాడు. రంగనాథాన్ని చూసి అయన ఆశ్చర్యపడుతూ లేచి, "ఏమిటి ఇలా దయ చేశారు?" అని అడిగాడు.

రంగనాథం నవ్వి, "మీ కోసమే. మీ ఆరోగ్యం సరిగా లేదట గదా?" అన్నాడు.



"నా ఆరోగ్యానికేం? పిడిరాయిలా ఉన్నాను," అన్నాడు భద్రయ్య.

"అలా అనకండి. మీరేమీ కంగారు పడవద్దు. నేను మీకు ఉచితంగా వైద్యం చేస్తాను," అన్నాడు రంగనాథం.

భద్రయ్య నవ్వి, "ఎంత మాట! మీ దగ్గిర వైద్యం చేయించుకుని, డబ్బిచ్చే ధైర్యం నా కెక్కడిది? అయినా, 'నేను జబ్బు పడ్డానని మీ కెవరు చెప్పారు?" అని అడిగాడు.

"మీ పొరుగింటి పాపయ్య కొడుకు చెప్పాడు," అన్నాడు రంగనాథం.

భద్రయ్యకు చాలా కోపం వచ్చింది. వెంటనే పక్క ఇంటికి వెళ్ళి పాపయ్య కొడుకును పిలుచుకు వచ్చాడు.

రంగనాథం పాపయ్య కొడుకు వంక కోపంగా చూసి, "ఏం రా, ఈయనకు జబ్బున్నావు? మనిషి నిక్షేపంలా ఉంటే?" అని అడిగాడు.

పాపయ్య కొడుకు నింపాదిగా, "ఈయన పిల్లలకు పెట్టకుండా బత్తాయి పళ్ళు తింటున్నారు. మా నాన్న మాకు పెట్టకుండా ఏ పండూ తినడు. కాని జబ్బుచేసినప్పుడు మాత్రం తను ఒక్కడే తింటాడు. ఎందుకంటే, ఎక్కువ కొనుక్కునేందుకు మాకు డబ్బు లేదుగా!" అన్నాడు.

"అయితే, పిల్లలకు పెట్టకుండా పళ్ళు తింటున్నానని నాకు జబ్బుచేసిందంటావా? నాకు జబ్బు చేస్తే వైద్యుణ్ణి



నేను పిలిపించుకో లేనూ?'' అని భద్రయ్య ఆ కుర్రవాణ్ణి కోపంగా అడిగాడు.

''మీరు పిసినిగొట్టు గద! డబ్బు ఖర్చయి పోతుందని వైద్యం చేయించు కోవటం లేదేమో అనుకున్నాడు. రంగ నాథంగారు ఊరికే వైద్యం చేస్తారని మీకు తెలీదేమోనని, అయనింటికి పరి గెత్తాడు, నాన్నా!'' అని భద్రయ్య కొడుకు చంద్రం అన్నాడు.

ఆ మాట విని భద్రయ్యకు చాలా కోపం వచ్చింది. అయన పాపయ్య కొడుకుతో, ''ఏంరా, నేను పిసినిగొట్టు నని నీకు తెలిసింది గద! అందుకే నేను నా పిల్లలకు పెట్టకుండా పళ్ళు తింటు న్నానని గ్రహించ లేక పోయావా?'' అన్నాడు.

''మా నాన్న జబ్బు చేసినప్పుడు పళ్ళు తను ఒక్కడే తింటాడే, అప్పుడు అయన కళ్ళనీళ్ళు పెట్టుకుని, 'ఎంత పిసినిగొట్టు కూడా కన్న బిడ్డలకు పెట్ట కుండా తాను తినడు, కాని నేనుమాత్రం మీకు లేకుండా పళ్ళు తినేస్తున్నాను,' అంటాడు. అందుకని మీకు జబ్బే చేసి ఉండాలను కున్నాను,'' అన్నాడు పాపయ్య కొడుకు నింపాదిగా.

భద్రయ్య మొదట ఉలిక్కిపడ్డాడు. తరవాత అయన తమాయించుకుని, పాపయ్య కొడుకు భుజం తట్టుతూ రంగ నాథంతో, ''రంగనాథంగారూ, వీడు చెప్పే నది నిజం! చాలాకాలంగా నేను జబ్బుతో బాధ పడుతున్నాను. అందుకే ఇంత కాలమూ నేను కట్టుకున్న ఇల్లాలినీ, కన్న బిడ్డలనూ సుఖపెట్టలేక పోయాను. వీడు మిమ్మల్ని తీసుకు రావడం నాకు మంచిదే అయింది,'' అన్నాడు.

ఆ రోజు రాత్రి భద్రయ్య రంగనాథం కుటుంబానికీ, పాపయ్య కుటుంబానికీ విందు చేశాడు. భద్రయ్య పిల్లలు మొదటి సారిగా మంచివంటకాలు రుచి చూశారు. ఆ తరవాత మరెన్నడూ వాళ్ళు చిరుతిళ్ళ కోసం మొహం వాచిపోలేదు.



# తెలివి వచ్చింది!

ఒక ఊళ్ళో వెర్రెయ్య అనే మందమతి ఉండేవాడు. వాణ్ణి అందరూ "వెర్రి వెధవా?" అని పిలిచేవాళ్ళు. తెలివి రావటానికి మార్గం ఏదైనా ఉంటే బాగుండునని వాడికి అనిపించింది.

ఒకనాడు వాడు ఒక బెస్తవాణ్ణి, "నాకు తెలివి రావాలంటే ఏం చెయ్యాలి?" అని అడిగాడు. రోజుకొక చేపమెదడు వండుకుని తింటే తెలివితేటలు వస్తాయని బెస్తవాడు చెప్పాడు.

వెర్రెయ్య ఆ బెస్తవాడి దగ్గిరే రోజుకు ఒక రూపాయి యిచ్చి, చేపతలను కొనుక్కు పోయేవాడు. బెస్తవాడు మిగిలిన చేపను రూపాయికి అమ్మి లాభం చేసుకునే వాడు. ఇలా ఒక నెల గడిచినాక వెర్రెయ్య బెస్తవాడి వద్దకు వచ్చి, "మొత్తం చేప ఖరీదు రూపాయి అయితే, ఒక్క తలకే నువు నా వద్ద రూపాయి తీసుకుంటున్నావు. ఇది అన్యాయం," అన్నాడు.

బెస్తవాడు నవ్వి, "చూశావా, నీకు తెలివొచ్చింది!" అన్నాడు. వెర్రెయ్య తృప్తిపడి ఇంటికి పోయాడు.

—మల్లెల సీతారాంరావు





# దొరికిపోయిన దొంగ

సుబలుడు ఒక గ్రామంలో ధనికకుటుంబానికి చెందినవాడు. వాడు దగ్గిరలో ఉన్న పట్టణంలో తన మేనమామ ఇంద్రలాల్ ఇంట ఉంటూ చదువుకుంటున్నాడు. ఇంద్రలాల్ ఇంద్రజాలం తెలిసినవాడు. సుబలుడు పదిహేనేళ్ళవాడు.

సుబలుడు శలవులకు ఇంటికి వస్తూ ఉండేవాడు. తిరిగి ఒకటి రెండు రోజులలో స్కూలు తెరుస్తారనగా పట్టణం పోయేవాడు. ఒక వేసవి శలవులకు వాడు తన గ్రామం చేరేసరికి గ్రామంలో అమిత సంచలనంగా ఉన్నది.

"మీ కందరికీ ఏమయింది? అందరూ ఎందుకింత అడావుడి పడుతున్నారు?" అని సుబలుడు తన మిత్రుడైన సుశీలుణ్ణి అడిగాడు.

"నీ కింకా తెలీదా? మన వూరి కొక మహాపురుషుడు వచ్చాడు. ఆయన సాక్షాత్తూ దేవుడే! ఏది కావాలంటే అది చేయగలడు. నీటి మీద నడుస్తాడు. నిప్పుల్లో నడుస్తాడు," అన్నాడు సుశీలుడు ఉద్రేకంతో.

"ఈ అద్భుతాలన్నీ నువు చూశావా?" అని సుబలుడు అడిగాడు.

"లేదు కాని, అందరూ చెబుతున్నారు. నేను మాత్రం ఒక అద్భుతం కళ్ళారా చూశాను," అన్నాడు సుశీలుడు.

"ఏమిటది?" అని సుబలుడు అడిగాడు.

"ఆయన పావుకోడు పలకలను కాళ్లకు తగిలించుకుని నడుస్తాడు. ఆ పావుకోళ్ళకు పాదాలు దూర్చే పట్టీ గాని కాలివేళ్ళతో పట్టుకునే బుడిపె గాని ఉండదు!" అన్నాడు సుశీలుడు.

సుబలుడికి ఆ మహాపురుషుణ్ణి చూడాలనిపించింది గాని, ప్రయాణం బడలిక

పి. సి. సర్కార్, ఇంద్రజాలికుడు

మీద ఉండటం చేత అప్పటికి ఆ ప్రయత్నం మాని, తిన్నగా ఇంటికి వెళ్ళాడు. ఆ రాత్రి వాడు భోజనం చేస్తూ తన తల్లిని, "అమ్మా, మన వూరికి ఎవరో గొప్పవాడు వచ్చాట్ట. నువు వాణ్ణి చూశావా?" అని అడిగాడు.

వాడి తల్లి చేతులు జోడించి నుదుట పెట్టుకుని, "ఘటానందస్వామి గురించేనా అడుగుతున్నావు? ఆయన్ను గురించి అలా తేలికగా మాట్లాడకు. మహాపురుషుడు!" అన్నది.

"ఆయన ఏం గొప్పపనులు చేశాడు?" అని సుబలుడు మళ్ళీ అడిగాడు.

"మిగిలిన వాటి మాట అలా ఉంచు. ఆయన మందు అమృతమే ననుకో. స్వామీజీ మంత్రించి తీర్థం ఇస్తే, నకులుడి కొడుకు జ్వరం మూడు మోతాదులతో తీసేసినట్టు పోయింది. శంకరుడి కూతురుకు భేదు లవుతుంటే స్వామీజీ మంత్ర తీర్థం ఇచ్చారు; తెల్లారేసరికల్లా నయమైపోయింది," అన్నది తల్లి.

"ఆయన పావుకోళ్ళ పలకలు కాలికి తగిలించుకుని నడుస్తారుట, నువు చూశావా?" అని సుబలుడు తల్లిని అడిగాడు.

"ఆ అద్భుతం గ్రామంలో అందరూ చూశారు. కొంత మంది ఆయన నీళ్ళ



మీద నడవటమూ, నిప్పుల్లో నడవటమూ చూశారట. నువు రేపు వెళ్ళి వారికి వందనంచేసి, ఆశీర్వాదం పొందు," అన్నది సుబలుడి తల్లి.

సుబలుడు ఆ రాత్రి ఎలాగో గడిపి, మర్నాడు తెల్లవారగానే సుశీలుణ్ణీ, విష్ణునూ, నటవరుణ్ణీ, ఇతర మిత్రులనూ కలుపుకుని, గ్రామం చిట్టచివర మర్రి చెట్టు కింద ఉన్న పాడుపడిన ఇంటికేసి వెళ్ళాడు.

చెట్టు కింద, పెద్ద నెగడుకు దగ్గిరగా జింక చర్మం మీద స్వామీజీ కూర్చుని ఉన్నాడు. ఆయన కళ్ళు మూసుకుని, ధ్యానంలో ఉన్నాడు. ఆయన నల్లగా,



బలిష్ఠంగా, ఆరోగ్యంగా ఉన్నాడు. అయన జుట్టు జడలు కట్టుకుని ఉన్నది. ఆయన గడ్డం బొడ్డుదాకా వేళ్ళాడుతున్నది. అయన అనుచరులు ఇద్దరు, గడ్డాల వాళ్ళు, ఆయన కోసం గంజాయి చిలుము తయారు చేస్తున్నారు.

కుర్రవాళ్ళు అక్కడ చేరిన కొద్ది నిమిషాలకు స్వామీజీ గట్టిగా, "హర హర! భం, భం! శివశంభో! శివశంభో!" అని అరిచి, నింపాదిగా కళ్ళు తెరిచి, కుర్రవాళ్ళను చూసి మందహాసం చేసి, వారిని దగ్గిరికి రమ్మని సైగ చేశాడు. భయపడుతూ వాళ్ళు ఆయనను సమీపించారు.

"నన్ను చూసి ఎందుకు భయపడతారు? వచ్చి ఈ పళ్ళు తీసుకోండి," అంటూ స్వామీజీ తన పక్కనే ఉన్న పళ్ళను చూపాడు.

మామూలుగా నదురూ, బెదురూ లేనివాడే అయినా సుబలుడు ఆ వాతావరణం చూసి బెదిరిపోయి, ఒక్కొక్క అడుగే వేస్తూ, స్వామీజీని సమీపించాడు. అతని వెనకగా మిగిలిన పిల్లలు కూడా వెళ్లారు. స్వామీజీ వారందరికీ పళ్ళూ, మిఠాయి దినుసులూ ఇచ్చాడు. "మీరు సాయంకాలం మళ్ళీ రండి. మీకు పళ్ళూ, మిఠాయీ ఇస్తాను," అన్నాడు.

కుర్రవాళ్ళు స్వామీజీకి నమస్కారాలు చేసి, ఇవతలికి వచ్చేశారు. సుబలుడు స్వతహాగా అనుమానించే స్వభావం గలవాడు. కాని అతనికి స్వామీజీ మీద కొంత గురి కుదిరి, ఆయన చేసే మహిమలు చూడాలన్న ఆసక్తి కలిగింది.

ఆ సాయంకాలం కుర్రవాళ్ళ బృందం స్వామీజీని చూడబోయే సమయానికి అక్కడ పెద్ద గుంపు ఉన్నది. వచ్చినవారిలో చాలామంది స్వామీజీకి ఫలాలూ, మిఠాయీ, పాలూ, బియ్యమూ, పూలూ, మాలలూ తెచ్చారు.

క్రమంగా సూర్యాస్తమానమై, స్వామీజీ పూజకు వేళ అయింది. "హర హర

శంభో!'' అని అరిచి, ఆయన లేచి నిలబడే సరికి ఆయన అనుచరు లిద్దరూ దగ్గిరికి వచ్చారు.

''కాళ్ళూ, చేతులూ కడుక్కోవాలి, ప్రక్షాళనకు గంగాజలం ఎక్కడ?'' అని ఆయన తన అనుచరులను అడిగాడు.

''గంగాజలం సిద్ధంగానే ఉన్నది. కాళ్ళూ, చేతులూ కడుక్కోవచ్చు,'' అన్నాడు ఒక అనుచరుడు.

స్వామీజీ ఒక పీట మీద కూర్చుని, అనుచరుడు కుండతో నీరు పోస్తూంటే, కాళ్ళూ, చేతులూ కడుక్కున్నాడు. రెండో అనుచరుడు పట్టీలేని రెండు పావుకోడు పలకలు తెచ్చి ఆయన ముందు పెట్టాడు. స్వామీజీ వాటి మీద పాదాలు అనించి, ఒక నిమిషం పాటు కళ్ళు మూసుకుని ఏదో మంత్రం చదివి, నాలుగడుగులు వేసి తన యథాస్థానానికి నడిచివెళ్ళాడు.

''ఘటానందస్వామీజీకీ జై!'' అని జనం అరిచారు.

ఇది చూసి సుబలుడికి దిమ్మతిరిగి పోయింది. అద్భుతం! ఏదో అతీత శక్తి లేకుండా ఇలాటి పని చెయ్యటం ఎవరి తరమూ కాదు. స్వామీజీ తన కాళ్ళను శుభ్రంగా కడుగుకున్నాడు గనక సందేహానికి అవకాశం లేదు. ఇదేదో యోగ శక్తి, సందేహం లేదు. తన మేనమామ ఇంత కన్న పెద్ద అద్భుతాలే చేస్తాడు గాని అదంతా గారడీ, మోసం! తన మేనమామ చేసే అద్భుతాలలో చాలా





వాటి మర్మం సుబలుడికి తెలుసును. కాని తన మేనమామ ఇలా కర్రపలకలు కాళ్ళకు తొడుక్కుని నడవగలడా?

సుబలుడు ఇంటికి వెళ్ళి తన మేన మామకు ఉత్తరం రాస్తూ స్వామీజీ చేసిన దంతా వివరంగా రాశాడు. అలాంటి మహాత్ముడు తమ గ్రామంలో ఉన్నట్టు తన మేనమామకు తెలపటం వాడికి గర్వకారణ మయింది. సుబలుడి మేన మామ ఆ ఉత్తరాన్ని ఆసక్తితో చదివి, ఏదో చీటీ రాసి తన మిత్రుడొకడికి పంపాడు.

మర్నాడు ఆదివారం. తలవని తలంపుగా ఐంద్రజాలికుడు ఇంద్రలాల్ ముగ్గురు మిత్రులను వెంటబెట్టుకుని తన మేనల్లుడి ఇంటి వద్ద ప్రత్యక్ష మైనాడు. ఆయన వెంట వచ్చినవాళ్ళు మంచి అజాను బాహులూ, బలా ఢ్యులూనూ.

తన రాకకు సుబలుడు ఆశ్చర్య పోయే సరికి, ఇంద్రలాల్, "నీ ఉత్తరం చూశాక రావాలనిపించిందిరా!" అన్నాడు. స్వామీజీ మహిమ తన మేన మామను కూడా ఆకర్షించినందుకు సుబ లుడు సంతోషం వెలిబుచ్చాడు.

"మీ స్వామీజీ ఇంకా అద్భుతాలు చూపించ బోతున్నాడు," అన్నాడు ఇంద్రలాల్ వెంటవచ్చిన వారిలో ఒకడు.

"మీకు ఎలా తెలుసు?" అని సుబ లుడు ఆయనను అడిగాడు.

"మాకు తెలిసినదీ, మేము విన్నదీ అబద్ధం కాకపోతే ఘటానంద స్వామి త్వరలోనే మరికొన్ని అద్భుతాలు చేయ బోతున్నాడు. మునిరాం, ప్రసాద్‌లు ఈ స్వామీజీని ఒక కంట కనిపెట్టి ఉండటం మంచిది. లేకపోతే ఆయన ముందే పసిగట్టి, అదృశ్యం కూడా కాగలడు," అన్నాడు మరొకడు.

ఆయన చెప్పిన ఇద్దరు మనుషులూ వీధి బిచ్చగాళ్ళలాగా వేషాలు వేసుకుని, వెంటనే బయలుదేరి వెళ్ళారు. ఉండి

పోయిన మనిషి, "స్వామీజీ ప్రార్థన ఎప్పుడు మొదలు పెడతాడు?" అని సుబలుణ్ణి అడిగాడు.

"వేళ కావచ్చింది. ఆయన పావు కోళ్లతో నడవటం చూడదలిస్తే వెంటనే బయలుదేరాలి. కావాలంటే నేను మిమ్మల్ని అక్కడికి తీసుకు పోతాను," అన్నాడు సుబలుడు.

అందరూ కలిసి బయలుదేరారు. వాళ్ళు మర్రిచెటు ప్రాంతాన్ని చేరినాక, ఇంద్రలాల్ వెంట వచ్చిన మనిషి జేబులో నుంచి ఒక చిన్న ఫోటో పైకి తీసి, దాని కేసీ, ఘటానందస్వామి కేసీ కొంతసేపు చూసి, "నే ననుకున్నది అక్షరాలా నిజం, ఇంద్రలాల్," అన్నాడు.

మారు వేషాలు వేసుకున్నవారు అప్పటికే అక్కడికి చేరి, జనంలో కలిసి, స్వామీజీకీ, అతని అనుచరులకూ చెరొక దిక్కుగానూ నిలబడి ఉన్నారు.

స్వామీజీ కాళ్ళూ, చేతులూ కడుక్కొని, పట్టులేని పావుకోళ్ళు ధరించి నడవ నారంభించాడు. సుబలుడు తన మేనమామను పట్టుకుని, "చూడు, మామా! అద్భుతం! అద్భుతం!" అన్నాడు.

"చూడు, సుబల్. ఏదో బంకతో అంటించినట్టు పావుకోళ్ళు కాళ్ళకు అంటుకున్నాయి. అవును, ఇది పాత



విద్యే. పావుకోళ్ళకు వార్నిష్ బదులు తుమ్మబంక పూస్తారు. చూడు, ఆ పావు కోళ్ళు వార్నిష్ వేసినట్టున్నాయి, మేలు రకం తుమ్మజిగురు పూసి ఉండాలి. తడి కాళ్ళు బంకకు బాగా కరుచుకుంటాయి," అన్నాడు ఇంద్రలాల్.

సుబలుడికి అంతా అర్థమయింది.

అతని మేనమామ ఇంకా ఇలా చెప్పాడు: "ఈ ఘటానందస్వామి పెద్ద నేరస్థుడు. నా మిత్రుడు పోలీసుఇన్స్పెక్టరు. అతను ఏం చేస్తాడో చూతాం!"

అంతలోనే ఈల మోగింది. జనం మధ్య నుంచి బిచ్చగాళ్ళ వేషాలలో ఉన్న ఇద్దరూ బేడీలు పట్టుకుని స్వామీజీ

ముందుకు వచ్చారు. వాళ్ళపై అధికారి రెండు చేతులా రెండు పిస్తోళ్ళు పట్టుకుని స్వామీజీకి గురి చేసి, "చేతు లెత్తు!" అని కేక పెట్టాడు. జనం కదిలి దూరంగా ఆ ప్రదేశాన్ని చుట్టు ముట్టి, వింత చూడ సాగారు.

"రంగారావ్, నీ ఆట కట్టింది," అంటూ పోలీసు ఇన్‌స్పెక్టరు ముందుకు వచ్చి, స్వామీజీ గడ్డం పట్టుకుని గుంజాడు. అది అతని చేతిలోకి ఊడి వచ్చింది. స్వామీజీ అవతారమే మారి పోయింది.

ఇన్‌స్పెక్టరు అక్కడ చేరిన వారితో ఇలా అన్నాడు:

"మిత్రులారా, మీ రిప్పుడు మరింత గొప్ప అద్భుతం చూశారు. ఈ స్వామీజీ అవతారం మారి పోయింది. ఇతని అసలు సంగతి తెలుసుకోండి. ఇతను రంగారావు అనే పేరు మోసిన బందిపోటు దొంగ. ఇతను కొద్ది కాలం కిందట తన ఇద్దరు అనుచరులతో సహా జైలు నుంచి తప్పించు కుని పారిపోయాడు. వాళ్ళు ఇక్కడ ఇతని వెంటనే ఉన్నారు."

రంగారావు తన గుడ్డ సంచీలో చెయ్యి దూర్చబోయాడు. ఇన్‌స్పెక్టరు అది గమ నించి, "రంగారావ్, నీ పిస్తోలు తీయ టానికి ప్రయత్నించావో నీ తల పేలి పోతుంది. మంచి అబ్బాయిలాగా చేతులు చాచి మురుగులు తొడిగించుకో!" అంటూ రంగారావు చేతులకు బేడీలు వేశాడు.

ఘటానందస్వామి సరంజామా అంతా తనిఖీ చెయ్యగా చేతి తుపాకులూ, తూటాలూ లాటి నిషిద్ధ వస్తువులు దొరి కాయి. జ్వరమూ, భేదులూ, రక్త విరేచ నాలూ మొదలైన రోగాలకు ఔషధాలు గల సీసాలు కూడా అతని సంచిలో దొరికాయి.

"స్వామీజీ రోగాలు నయం చేసేది వీటితో నన్నమాట. ఈ మందులు నీటిలో కలిపి, మంత్ర జలమని ఇచ్చాడు. అమ్మతో అంతా చెప్పెయ్యాలి," అను కుంటూ సుబలుడు ఇంటికి పరిగెత్తాడు.



# నిందా-స్తుతీ

ఒక రాజు వద్దకు పొరుగుదేశం నుంచి ముగ్గురు అక్కచెల్లెళ్ళు వచ్చి తమకు గానంలోనూ, నాట్యంలోనూ, సంగీతంలోనూ గల ప్రావీణ్యం ప్రదర్శించారు. రాజు వారిని ప్రశంసించక, బహూకరించక, రెండు రోజులు తన అతిథిశాలలో ఉండమన్నాడు. అతిథిశాలలో అందరూ రాజుగారి వేగులవాళ్ళే.

అక్కచెల్లెళ్ళు అతిథిశాలకు పోయి, అక్కడ రాజును తలా ఒక విధంగా నిందించారు. "ఈ రాజు మండేకట్టె!" అన్నది పెద్దది. "కాదు, ముళ్ళమూట!" అన్నది రెండోది. "అదీ కాదు, రాతిపలుకు!" అన్నది మూడోది.

ఈ మాటలు రాజుకు చేరాయి. ఆయన వారిని మర్నాడు సభకు పిలిపించి, "నిన్న నన్ను గురించి మీరు ఏమేమి అన్నారు? ఎందుకు అలా అన్నారు?" అని అడిగాడు.

"మహారాజా, తమరు మండేకట్టె అన్నాను. అంటే నా ఉద్దేశం, మండేకట్టె వంట సిద్ధం చేస్తుంది. అది చల్లబడ్డాక ఆరగించవచ్చు. తొందర పడరాదని!" అని పెద్దది జవాబిచ్చింది.

"మహారాజా, నేను అందుకు ఒప్పుకోక, మీరు ముళ్ళమూట—అంటే పనసపండు—లాటి వారన్నాను. ముళ్ళు చెక్కేసి, ఓర్పుగా తొనలు తీసి తినాలి అన్నాను," అన్నది రెండోది.

"అది కూడా కాదు. పనసపండు కూడా కొంతకాలమే నిలవ ఉంటుంది. పటికబెల్లం ఎంత కాలమైనా ఉంటుంది. పైకి రాయిలాగా ఉన్నా నోట్లో వేసుకుంటే తియ్యగా ఉంటుంది. అందుచేత మీరు రాతిపలుకు అన్నాను," అన్నది మూడోది.

రాజు వాళ్ళ సమయస్ఫూర్తికి మెచ్చి, వాళ్ళకు బహుమానాలిచ్చి పంపేశాడు.





# ధారానగరపు పండితులు

ధారానగరంలో భోజరాజు మహాకవులను పోషిస్తూ ఉంటాడనీ, కాళిదాసు అక్కడ ఆస్థాన కవి అనీ విని కాంతికవి అనే ఆయన అసూయపడి, ఆ కాళిదాసును ఓడించి తానా స్థానాన్ని సంపాదించుకుందామని ధారానగరానికి వచ్చాడు.

ధారానగరం శివార్లలో కాంతికవికి ఒక కన్య కనబడింది. ఆయన ఆ పిల్లను, "నువ్వెవరి పిల్లవు?" అని అడిగాడు. దాని కామె,

"హర హర స్మరతే నిత్యం, బహు జీవ
ప్రపాలకః,
అరణ్యే వసతే నిత్యం, తస్యాహం కుల
బాలికా," అని చెప్పింది.

(ఎప్పుడూ అరణ్యాలలో ఉంటూ, హర హరా అంటూ, బహు జీవకోటిని పోషించే కులానికి—కాపులకు—చెందిన పిల్లను, అని దాని అర్థం.)

కాంతికవి ఈ సమాధానానికి ఆశ్చర్యపడి మరికొంత దూరం ముందుకు వెళ్ళే సరికి కొంతమంది స్త్రీలు నీళ్ళ కోసం పోతూ కనిపించారు. అందులో ఒకతెను ఆయన, "అమ్మాయీ, నువ్వెవరు?" అని అడిగాడు. దాని కామె,

"చతుర్ముఖో న చ బ్రహ్మ, వృషా
రూఢో న శంకరః,
అకాలే వర్షతే మేఘః, తస్యాహం కుల
బాలికా," అన్నది.

(నాలుగు ముఖాలున్నా బ్రహ్మ కాదు, ఎద్దు నెక్కినా శివుడు కాదు; కాలం కాని కాలంలో కూడా వర్షించే మేఘం; అలాటి కులానికి చెందినదాన్ని. అంటే నీరు తెచ్చే వారి కూతురినని అర్థం. నాలుగు ముఖాలు గల తోలు తిత్తిని ఎద్దు మీద తీసుకుపోయి, దానిలో నీరు నింపి తెచ్చి అందరికీ అందిస్తారు.)

---

ఎస్. గోపాలకృష్ణ

---



ఆ సమాధానం విని కాంతికవి మరింత ఆశ్చర్యపడి, మరొక ఆమెను, "నువ్వెవరు?" అని అడిగాడు. దాని కామె,

"పంచ భర్తా న పాంచాలీ, ద్విజిహ్వా
న చ సర్పిణీ,
వానరీ న చ కృష్ణాస్యా, తస్యాహం
కులబాలికా," అన్నది.

(లేకరికూతురుననిఆమెఅభిప్రాయం. లేకరి అయిదు వేళ్ళతో, చీలిన పాళీ గల కలాన్ని పట్టుకుని, సిరాలో ముంచి కలం ముఖాన్ని నల్లగా చేసి రాస్తాడు. భరించేటందుకు అయిదుగురున్నా ద్రౌపది కాదు కలం; రెండు నాలుకలున్నా పాము కాదు పాళీ; ముఖం నల్లగా ఉన్నా కోతి కాదు.)

కాంతికవి మరో ఆమెను, "నువ్వెవరు?" అని అడిగాడు. దాని కామె,

"నిత్యం జుహోతి ద్రవ్యాణి, చౌర్య
కారీ దినే దినే
శత్రుం మిత్రం న జానాతి, తస్యాహం
కులబాలికా," అన్నది.

(ఎప్పుడూ పదార్థాన్ని హోమం చేస్తూ, శత్రు మిత్ర విచక్షణ లేకుండా రోజూ - బంగారం-దొంగతనం చేసే వాళ్ళ పిల్లను. అంటే కంసాలి పిల్లను అని అర్థం.)

కాంతికవి అంత కంతకూ ఆశ్చర్యం ఎక్కువ కాగా మరో స్త్రీని, "నువ్వెవరి దానివి?" అని అడిగాడు. దాని కామె,

"బాహు రస్తి, శిరో నాస్తి, న సంత్యం
గుళికా దశ,
తస్యోత్పత్తికరో యస్తు, తస్యాహం కుల
బాలికా," అన్నది.

(చేతులుండి తలగాని, పదివేళ్ళుగాని లేని దాన్ని - చొక్కాను, తయారు చేసే వాళ్ళ దాన్ని. అంటే దర్జీల పిల్లను.)

"ఈ ధారానగరంలో తక్కువ కులాల ఆడవాళ్ళే ఇంత చాతుర్యం గల వాళ్ళయితే కాళిదాసు ఎంతటి వాడై ఉండాలి?" అనుకుంటూ కాంతికవి మరి కొంతదూరంపోయి, ఒక స్త్రీని చూసి, ఆమెను కూడా, "నువ్వెవరి దానివి?" అని అడిగాడు. దాని కామె,

"నిర్జీవో జీవితో వాపి శ్వాసోచ్ఛ్వాస విశేషతః,
కుటుంబకలహో నాస్తి, తస్యాహం కులబాలికా," అన్నది.

(ప్రాణం లేకపోయినా, ఉన్నట్టే గాలి పీల్చి విడుస్తుంది. కుటుంబ కలహం ఉండదు. అలాటి కులంలో – కమ్మరి – మనిషిని. కమ్మరి కొలిమి తితి పోస్తూ పని చేస్తాడు.)

కాంతికవి ఇంకా ముందుకు పోయే సరికి మరొక స్త్రీ ఎదురైంది. ఆయన ఆమెను, "నువ్వెవరు?" అని అడిగాడు. దాని కామె,

"ద్విరాజా, నగరీ ఏకా, నిత్యం యుద్ధం చ జాయతే.
త దుత్పత్తి కరో యస్తు, తస్యాహం కులబాలికా," అన్నది.

(ఒకే నగరానికి ఇద్దరు రాజులు. వాళ్ళు ఎప్పుడూ కలహిస్తారు. దాన్ని తయారు చేసే వాళ్ళ పిల్లను. నగరం అంటే పత్తిరాటం. రాజులంటే ఇరుసులు. అవి ఒక దాన్ని ఒకటి ఘర్షణ పెడుతుంది. దాన్ని చేసేవాడు వడ్రంగి. వడ్రంగి పిల్లను అని అర్థం.)

ఇంతలో ఇంకొక స్త్రీ అటుగా వచ్చింది. ఆమెను కూడా కాంతికవి, "నువ్వెవరు?" అని అడిగాడు. దాని కామె,

"చక్రైకం న రథీ సూర్యో, భూమౌ తిష్ఠతి సారథిః.
అగస్త్యతాత నిర్మాణ స్తస్యాహం కుల బాలికా," అన్నది.

(ఒకటే చక్రం. కాని రథికుడు సూర్యుడు కాడు. సారథి భూమి మీద కూర్చుంటాడు. అగస్త్యుడి తండ్రిని పుట్టిస్తాడు. అలాటి కులానికి చెందినదాన్ని. అంటే కుమ్మరిసారె మీద కుండలు చేసే కుమ్మరి వాళ్ళ పిల్లను అని అర్థం. అగస్త్యుడు కుండలో పుట్టాడనీ, సూర్యుడి రథానికి ఒకటే చక్రమనీ చెబుతారు.)

ధారానగర స్త్రీల తెలివితేటలు చూసి కాంతికవి కాళిదాసును ఓడించే ఆలోచన కట్టిపెట్టి, తిరిగి వెళ్ళిపోయాడు.





# మహాభారతం

పది రోజులు యుద్ధం చేసి భీష్ముడు యుద్ధరంగంలో పడిపోయాడు. ఆయన శిఖండితో యుద్ధం చెయ్యడు గనక అర్జునుడు శిఖండిని ముందు పెట్టుకుని, వెనక నుంచి తాను బాణాలు వేస్తూ భీష్ముణ్ణి పడగొట్టాడు.

భీష్ముడు పడిపోయాడు గాని వెంటనే చావలేదు. ఆయన శరీరం నిండా బాణాలు గుచ్చుకుని ఉండటం చేత, ఆయన పడిపోయినప్పుడు ఆయన శరీరం నేలకు తగలలేదు. ఆ స్థితిలో ఆయనకు దాహం వేస్తే, అర్జునుడు భూమిని బాణంతో కొట్టి, పాతాళగంగను పైకి తెప్పించాడు. ఉత్తరాయణం వచ్చినదాకా భీష్ముడు అంపశయ్య మీద ప్రాణాలతో ఉన్నాడు.

భీష్ముడి అనంతరం కౌరవసేనలకు ద్రోణుడు సర్వసేనాధిపత్యం వహించి, అయిదు రోజులపాటు యుద్ధం చేశాడు. ఆయన పన్నిన పద్మవ్యూహంలోకి ప్రవేశించి అర్జునుడి కొడుకైన అభిమన్యుడు శత్రుయోధుల మధ్య చిక్కి చనిపోయాడు. ఇది జరిగినప్పుడు అర్జునుడు దూరాన మరొక రంగంలో యుద్ధం చేస్తున్నాడు. అభిమన్యుడి వెనకగా మిగిలిన పాండవులు పద్మవ్యూహంలో ప్రవేశించబోతే, సైంధవుడు వారికి అడ్డుపడ్డాడు. ఆ కారణంగా అభిమన్యుడికి ఎవరూ సహాయం లేకపోయారు.

ఈ సంగతి విని అర్జునుడు మర్నాడు సైంధవుణ్ణి చంపుతానని ప్రతిజ్ఞ చేసి,

59. యుద్ధంలో పాండవుల విజయం



అంత పని చేశాడు. తరవాత ద్రోణుడూ, ధృష్టద్యుమ్నుడూ యుద్ధం చేస్తూండగా ధర్మరాజు అశ్వత్థామ చచ్చినట్టు అబద్ధం చెప్పాడు. తన కొడుకు చచ్చాడని ధర్మరాజు నోట విని ద్రోణుడు అస్త్రసన్యాసం చేసి, ప్రాయోపవేశం చేశాడు. అప్పుడు ధృష్టద్యుమ్నుడు ఆయనను చంపాడు.

ద్రోణుడు చనిపోయిన అనంతరం కౌరవ బలాలకు కర్ణుడు సర్వసేనాని అయాడు. కర్ణుడు శల్యుణ్ణి తనకు సారథిగా ఇప్పించమని దుర్యోధనుణ్ణి కోరాడు. శల్యుడు కర్ణుడికి సారథి కావటానికి ఒప్పుకున్నాడు, గాని అతను యుద్ధం చేసిన రెండు రోజులూ శల్యుడు అతన్ని అవమానిస్తూ, నిరుత్సాహపరుస్తూ వచ్చాడు. రెండవ రోజు కర్ణుడు అర్జునుడితో యుద్ధం చేస్తూండగా అతని రథచక్రం బురదలో కూరుకుపోయింది. కర్ణుడు దాన్ని ఎత్తుతూండగా అర్జునుడు అతన్ని చంపేశాడు.

కర్ణుడి అనంతరం శల్యుడు కౌరవ సేనాని అయినాడు. ఆయన ఆ రోజే ధర్మరాజుతో యుద్ధం చేస్తూ చచ్చిపోయాడు.

పద్ధెనిమిదో రోజున యుద్ధం ముగిసింది. ఆ యుద్ధంలో పద్ధెనిమిది అక్షౌహిణుల సేన పోయింది. దుర్యోధనుడు తప్ప అతని తమ్ములందరూ పోయారు. దుశ్శాసనుణ్ణి భీముడు భయంకరంగా చంపి, అతని నెత్తురు తాగాడు.

యుద్ధంలో ఉభయపక్షాల యోధులూ అనేకవేలమంది చనిపోయారు. పాండవుల పక్షాన పాండవులూ, ఉపపాండవులూ, యుయుత్సుడూ, సాత్యకీ, ధృష్టద్యుమ్నుడూ, శిఖండీ మిగిలారు.

యుయుత్సుడు ధృతరాష్ట్రుడికి పుట్టినవాడు. యుద్ధం ముగియగానే అతను హస్తినాపురానికి వెళ్ళిపోయాడు.

కౌరవుల పక్షాన అశ్వత్థామా, కృపుడూ, కృతవర్మా, దుర్యోధనుడూ మిగిలారు. యుద్ధం ఆఖరు దశలో కృపాశ్వత్థామలూ,

కృతవర్మ దుర్యోధనుడి కోసం చూస్తే అతను ఎక్కడా కనిపించలేదు. అతను గద ఒకటి భుజాన పెట్టుకుని ఒక పెద్ద మడుగు వద్దకు వెళ్ళాడు. కృతవర్మ, కృపుడూ, అశ్వత్థామా ప్రాణాలతో మిగిలారన్నది కూడా అతనికి తెలియదు.



మడుగు వద్ద కూర్చుని ఉన్న దుర్యోధనుడి వద్దకు సంజయుడు వచ్చాడు. తనకు అపజయం కలిగినందుకూ, తన వారంతా పోయినందుకూ విచారిస్తున్న దుర్యోధనుడు సంజయుణ్ణి చూసి, "మన వాళ్ళలో నువు తప్ప ఇంకెవరూ మిగలలేదా? నేను ఈ మడుగులో ఇంకా ప్రాణాలతో ఉన్నానని నా తండ్రికి చెప్పు," అని మడుగులో ప్రవేశించాడు.

సంజయుడు అక్కడి నుంచి వచ్చేస్తుండగా అతనికి కృతవర్మ, కృపుడూ, అశ్వత్థామా కనబడి, "సంజయా, దుర్యోధనుడు ఎక్కడ?" అని అడిగారు.

సంజయుడు వాళ్ళకు మడుగును చూపించి, దుర్యోధనుడు జలస్తంభన చేసి అందులో ఉన్నట్టు చెప్పాడు.

అశ్వత్థామ పెద్దగా ఏడుస్తూ, "అయ్యో, మేము బతికి ఉన్న సంగతి అతనికి తెలీదు కాబోలు. మేము నలుగురమూ కలిసి శత్రువులను జయించలేమా?" అన్నాడు. వాళ్ళు ముగ్గురూ పాండవులతో యుద్ధం చేస్తామని బయలుదేరారు. కాని వాళ్ళు రణరంగానికి చేరేసరికి చీకటి పడింది. కౌరవ శిబిరానికి చెందిన స్త్రీలను సేవకులు హస్తినాపురానికి తీసుకుపోతున్నారు.

యుద్ధం అయిపోగానే పాండవులు కృష్ణుడితో సహా దుర్యోధనుడి కోసం వెతకసాగారు. దుర్యోధనుడు మడుగులో దాగి ఉన్న సంగతి వారికి తెలిసింది. వాళ్ళు అక్కడికి వచ్చారు.

ధర్మరాజు దుర్యోధనుడితో, "నీ వంశమంతా నాశనమయాక నీ ప్రాణాలు దక్కించుకోవటానికి మడుగులో దాక్కున్నావా? ఇది అక్రమం. బయటికి వచ్చి



మాతో యుద్ధం చెయ్యి. నీ వంటి గర్విష్ఠికి ఈ పిరికితనం తగదు. మమ్మల్ని ఓడించకుండా నీ రాజరికం నిలవదు. వచ్చి, మమ్మల్ని ఓడించు,'' అన్నాడు.

''నాకు రాజ్యం అక్కర్లేదు. నువే అంతా ఏలుకో,'' అన్నాడు దుర్యోధనుడు.

''నీ నుంచి నాకు రాజ్యదానం అవసరం లేదు. అదీగాక, దానం చెయ్యటానికి నీకు ఇప్పుడు రాజ్యమూ లేదు. మమ్మల్ని జయించి రాజ్యం పొందు, లేదా మా చేతిలో ఓడిపో,'' అన్నాడు ధర్మరాజు.

ఇలాటి సూటి పోటి మాటలతో పాండవులు రెచ్చగొట్టే సరికి, దుర్యోధనుడు మడుగు నుంచి బయటికి వచ్చి, భీముడితో గదాయుద్ధం చేశాడు. భీముడు దుర్యోధనుడి తొడలు విరగ గొట్టాడు.

తొడలు విరిగి పడిపోయి ప్రాణాలతో ఉన్న దుర్యోధనుడి వద్దకు కృపాశ్వత్థామ కృతవర్మలు వచ్చి, అతని దుస్థితికి విచారించారు. అశ్వత్థామ ఆ రాత్రే పాండవులనూ, బతికి ఉన్న ఇతర పాంచాలులనూ చంపేస్తానని దుర్యోధనుడి దగ్గిర ప్రతిజ్ఞ చేశాడు. ఈ మాటకు దుర్యోధనుడు సంతోషించి, అశ్వత్థామను తన సర్వసేనానిగా నియమించాడు.

తరవాత ఆ యోధులు ముగ్గురూ బయలుదేరి, పాండవ శిబిరాలకు సమీపంగా ఒక చోట దాక్కున్నారు. అక్కడ అరణ్యం ఉన్నది. అందులో ఒక వెయ్యి కొమ్మల మర్రిచెట్టు కింద వాళ్ళు విశ్రమించారు. అశ్వత్థామ శత్రువులను అన్యాయంగా, నిద్రపోతున్నప్పుడే చంప నిశ్చయించాడు. ఎందు కంటే, పాండవులు అలాంటి అన్యాయాలు యుద్ధంలో చాలా చేశారు. అతను కృపుణ్ణీ, కృతవర్మనూ ఇందుకు ఒప్పించి, వారితో బయలుదేరి పాండవ శిబిరానికి వచ్చాడు. కృపుణ్ణీ, కృతవర్మనూ అతను శిబిర ద్వారం వద్ద నిలబెట్టి, తాను కత్తి దూసి లోపల ప్రవేశించి, ముందుగా ధృష్టద్యుమ్నుణ్ణి నిద్ర



లేపి, అతన్ని చంపాడు. ఈ అలికిడికి కొందరు లేచి, అతని మీదికి వచ్చారు. అశ్వత్థామ అందరినీ చంపాడు. తరవాత అతను ఉపపాండవు లందరిని చంపాడు. శిబిరంలో వాళ్ళు మేలుకుని, వారిలో కొందరు అశ్వత్థామతో యుద్ధం చేసి చచ్చారు; బయటికి పారిపోతున్న వారిని కృపుడూ, కృతవర్మా చంపారు. తరవాత ముగ్గురూ చేరి శిబిరానికి మూడు వైపులా అగ్గి పెట్టారు. తరవాత వాళ్ళు ఈ వార్తను దుర్యోధనుడికి చెప్పటానికి బయలు దేరారు.

ఆ రాత్రి పాండవులు ఆ శిబిరంలో లేరు. ఉన్నట్టయితే వాళ్ళు అశ్వత్థామ చేతిలో చావటమో, లేక వాళ్ళు అశ్వత్థామకు ఈ దారుణ హత్యాకాండ చెయ్యకుండా అడ్డుపడటమో జరిగేది.

కృపాశ్వత్థామ కృతవర్మలు వచ్చేసరికి దుర్యోధనుడు మరణవేదన పడుతున్నాడు. అతను వాళ్ళు చేసినదంతా విని, సంతోషిస్తూ ప్రాణాలు వదిలాడు.

తమ కొడుకులూ, బంధువులూ యుద్ధంలో గెలిచి కూడా హత్యకు గురి అయినట్టు తెలిసి, పాండవులూ, ద్రౌపదీ మొదలైన వాళ్ళు ఎంతో శోకించారు. ఇంత పని చేసిన అశ్వత్థామను చంపేస్తానని భీముడు బయలు దేరాడు.

అప్పుడు ద్రౌపది, "ఆ అశ్వత్థామ తలలో మణి ఉంటుందట. వాణ్ణి చంపి, ఆ మణి తెస్తే నేను కళ్ళారా చూస్తాను," అన్నది.

భీముడు ధనుర్బాణాలు తీసుకుని రథం మీద బయలుదేరాడు. అది చూసి కృష్ణుడు భీముడికి తోడుగా అర్జునుణ్ణి కూడా వెళ్ళమన్నాడు. కృష్ణుడితో బాటు ధర్మరాజూ, అర్జునుడూ కూడా మరొక రథం ఎక్కి బయలు దేరారు. వాళ్ళు త్వరలోనే భీముణ్ణి చేరుకున్నారు, కాని భీముణ్ణి వెనక్కు మళ్ళించ లేక పోయారు.

వాళ్ళు గంగాతీరాన్ని చేరేసరికి, వ్యాసుడూ, అతని అనుచరులైన



కక్కుతూ ఒక దాని నొకటి ఎదు ర్కొన్నాయి.

అప్పుడు వ్యాసుడూ, నారదుడూ ముందుకు వచ్చి, ఇద్దరినీ అస్త్రాలు ఉప సంహరించ మన్నారు. అర్జునుడు తన అస్త్రాన్ని ఉపసంహరించాడు. అశ్వత్థామకు ఆ పని చేత కాలేదు. అతను వ్యాసుడితో, "నేను భీముణ్ణి చూసి ఈ అస్త్రాన్ని ప్రయోగించాను. ఉపసంహరించటం నా వల్లకాదు. ఇది పాండవులను నిర్మూలించక విడవదు," అన్నాడు.

కృష్ణుడు ఆ మాట విని, "సరే, పాండవుల అంకురం ఇప్పుడు ఉత్తర గర్భంలో ఉన్నది. దాని మీద నీ అస్త్రం ప్రయోగించు," అన్నాడు.

అశ్వత్థామ తన తలలో ఉన్న మణిని అర్జునుడి కిచ్చేటట్టూ, అర్జునుడు అతన్ని ప్రాణాలతో వదిలేటట్టూ ఋషులు రాజీ పరిచారు. అశ్వత్థామ తన తలలోని మణి తీసి అర్జునుడి కిచ్చి, అడవులు పట్టి పోయాడు. భీముడు ఆ మణిని తీసుకుపోయి ద్రౌపది కిచ్చి, "ఇక విచారించకు," అన్నాడు. ద్రౌపది ఆ మణిని ధర్మరాజు తలలో ధరించ టానికి ఇచ్చింది.

ఋషులూ, వారి వెంట అశ్వత్థామా కని పించారు. అశ్వత్థామ మట్టిగొట్టుకుని, నారబట్టలు కట్టుకుని ఉన్నాడు. అశ్వత్థా మను చూస్తూనే భీముడు భయంకరంగా కేక పెట్టాడు. అశ్వత్థామ భీముణ్ణీ, అతని వెనకగా వచ్చే కృష్ణుడి వెంట ధర్మరాజునూ, అర్జునుణ్ణీ చూసి ఏమీ తోచక, తన తండ్రి తనకిచ్చిన బ్రహ్మ శిరోనామకాస్త్రం అనే భయంకరమైన అస్త్రాన్ని ఆవాహన చేసి, "అపాండవం అగుగాక" అని దాన్ని ప్రయోగించాడు. కృష్ణుడు ప్రేరేపించగా అర్జునుడు కూడా అదే అస్త్రాన్ని ప్రయోగించాడు. రెండు అస్త్రాలూ భయంకరంగా మంటలు

హస్తినాపురంలో ధృతరాష్ట్రుడు తన నూరుగురు కొడుకులూ యుద్ధంలో

పోయినందుకు అంతులేని విచారంలో మునిగిపోయాడు. సంజయుడు ఆయనతో, "నీ కొడుకులే ఏమిటి? పద్ధెనిమిది అక్షౌహిణుల సేన నాశనమయింది. ప్రపంచంలో ఉన్న రాజులందరూ చచ్చారు. చచ్చిన వారి కందరికీ ప్రేత కార్యాలు చేయించు," అన్నాడు.

ధృతరాష్ట్రుడి వెంట గాంధారీ, కుంతీ, ఇతర అంతఃపుర స్త్రీలూ ఏడుస్తూ యుద్ధ భూమికి వచ్చారు. ఈ సంగతి తెలిసి పాండవులు కృష్ణుణ్ణీ, సాత్యకినీ, యుయుత్సుణ్ణీ వెంటబెట్టుకుని అక్కడికి వచ్చారు.

ధర్మరాజు ధృతరాష్ట్రుడికి నమస్కరించి, ఆయనను చూడటానికి వచ్చిన వారందరి పేర్లూ చెప్పాడు. ధృతరాష్ట్రుడికి లోపల మండిపోతున్నది. ఆయన ధర్మరాజును కౌగలించుకుని, తరవాత భీముణ్ణి కౌగలించుకోబోయాడు. కృష్ణుడు భీముణ్ణి వెనక్కులాగి, ఇనప భీమ విగ్రహాన్ని ముందుకు తోశాడు. ధృతరాష్ట్రుడు ఆ విగ్రహాన్ని బలంగా కౌగలించుకునేసరికి, అది కాస్తా పిండి అయిపోయింది. అదే నిజంగా భీముడైతే చచ్చే ఉండేవాడు. ధృతరాష్ట్రుడి బలం వెయ్యి ఏనుగుల బలం! కాని ఇనప విగ్రహాన్ని నుగ్గు చేసి ధృతరాష్ట్రుడు ముక్కులా, నోటా నెత్తురు కక్కుతూ కింద పడిపోయాడు. తరవాత ఆయన, "అయ్యో, భీమా!" అంటూ దొంగ ఏడుపు సాగించాడు.

కృష్ణుడు ఆయనతో, "రాజా, విచారించకు. నువు నుగ్గు చేసినది భీముణ్ణి కాదు. ఇనప విగ్రహాన్ని," అన్నాడు. ఆ విగ్రహం దుర్యోధనుడు తన గదా యుద్ధాభ్యాసం కోసం చేయించినది.

తరవాత కృష్ణుడు ధృతరాష్ట్రుణ్ణి ఊరడించాడు.

"నా కిప్పుడు పాండవులు తప్ప కొడుకు లెవరున్నారు?" అంటూ ధృతరాష్ట్రుడు భీమార్జున నకుల సహదేవుల శరీరాలు నిమిరాడు.






## 8

నక్క కాకికి కొంగా, ఎండ్రకాయల కథ ఇలా చెప్పింది:

### కొంగా, ఎండ్రకాయల కథ

ఒక చెరువు గట్టున ఒక కొంగ నివసిస్తూ ఉండేది. అది ముసలిదైపోయి, శ్రమ లేకుండా చేపలను తినాలనుకున్నది. అది నీటి అంచున దైన్యంతో నిలబడి, తనకు సమీపంగా వచ్చిన చేపలను కూడా తినటం మానేసింది.

చేపల మధ్య ఒక ఎండ్రకాయ ఉన్నది. అది కొంగను సమీపించి, ''మామా, ఇవాళ నువు తిండీ, ఆటలూ మానేసి నట్టున్నావేమిటి ?'' అని అడిగింది.

దానికి కొంగ, ''ఎంతోకాలం చేపలను తిని సుఖంగా జీవించాను. అవి నా మిత్రులు. మీ కందరికీ గొప్ప విపత్తు రానున్నది. అందుచేత, ఈ వార్ధక్యంలో నాకు సుఖజీవనం లేకుండా పోబో తున్నది. అదే నాకు పట్టుకున్న విచారం,'' అన్నది.

''ఈ రాబోయే కష్టం ఎలాటిది, మామా?'' అన్నది ఎండ్రకాయ.

''ఇవాళ ఉదయం కొందరు జాలర్లు అనుకుంటుంటే విన్నాను: 'ఇది చాలా పెద్ద చెరువు. ఇందులో చాలా చేప లున్నాయి. ఆదివారం సాయంకాలాని కల్లా మిగిలిన నాలుగు చెరువులలోనూ వేట ముగించి, సోమవారం తెల్లవారే సరికి ఇక్కడికి వచ్చి, మనం కొత్తగా చేసిన వలలతో చేపలనూ, ఇతర జల చరాలనూ పట్టేద్దాం,' కనక, వారం తిరిగే సరికి ఈ చెరువులో ఒక్క చేప గాని, ఇతర జలచరం గాని మిగలదు. ఇవాళ సోమవారం గద. ఈ వార్ధక్యంలో

అట్ట చివరి బొమ్మ



నాకు నోటి ముందరి కూడు కాస్తా పోతుంది,'' అన్నది కొంగ.

కొంగ చెప్పిన మాయమాటలు విని, చెరువులోని చేపలూ, ఇతర జీవాలూ ప్రాణభయంతో కొట్టుకుపోయాయి. అవి అన్నీ తమ తమ వయసునూ, హెూదానూ బట్టి కొంగను 'తండ్రీ, తాతా, మామా, అన్నా, మిత్రమా, గురూ' అని సంబో ధిసూ, ''ఆపద గురించి ముందుగా మాకు తెలియజేయటం మంచిదయింది. ఈ ఆపద నుంచి మమ్మల్ని కాపాడటం నీకు సాధ్యం కాకపోదు,'' అన్నాయి.

''అండజాన్ని అయిన నేను పిండజు లైన మనుషులతో ఏం పోటీ చేయగలను. అయినా నాకొక ఆలోచన తట్టింది. మీరంతా నాతో సహకరిస్తే ప్రయత్నం ఫలించవచ్చు. కొద్ది దూరంలో ఒక పెద్ద దేవాలయం ఉన్నది. దాని పక్కన లోతైన కోనేరున్నది. దాని నిండా తామర పూలు ఉన్నాయి. ఆ కోనేట్లో చేపలు పట్టరాదు. అక్కడ మీరు క్షేమంగా ఉండవచ్చు. జట్లు, జట్లుగా మిమ్మల్ని నా వీపు మీద ఎక్కించుకుపోయి, అక్కడ చేర్చగలను,'' అని కొంగ అన్నది.

ఈ మాటలు విని మోసపోయి చేప లన్నీ ఆనందంతో కొంగకు తమ కృతజ్ఞత తెలుపుకున్నాయి. కొంగ కూడా లోలోపల నవ్వుకుని, చేపలను మోసగించి తేలికగా తినవచ్చుననుకున్నది.

అది ఒక్కొక్క జట్టు చేపలనూ తన వీపు మీద ఎక్కించుకుని, దేవాలయపు కోనేరు కని బయలుదేరి, ఎండకు కాలిన ఒక కొండరాతి మీద వాలి, దిక్కులేని చేపలను దాని మీద పడేసి, తింటూ వచ్చింది. రోజు రోజుకూ దాని ఆనందం పెరిగిపోతున్నది. చెరువులో మిగిలి ఉన్న చేపలకు అనుమానం కలగకుండా, కొలను చేరిన చేపల నుంచి సందేశాలు తెచ్చి చెబుతూ ఉండేది.

ఎండ్రకాయకు కూడా ప్రాణభయం పట్టుకుని, జాలరులు వచ్చే రోజు దగ్గిర



పడుతూ ఉండటం చేత, ''మామా, నన్ను కూడా రక్షించుదూ!'' అని కొంగను వేడుకున్నది.

రోజూ చేపలను తిని మొహం మొత్తి ఉండటం చేత కొంగ, కొత్తరకం ఆహారం తినవచ్చునన్న ఆశతో, ఎండ్రకాయను తన వీపు మీద ఎక్కించుకుని ఉత్సాహంగా ఎగిరిపోయి, కొండరాయి మీద వాలబోయింది.

''మామా, దేవాలయం ఏది? లోతైన కోనేరేది?'' అని ఎండ్రకాయ కొంగను అడిగింది.

కొంగ వెటకారంగా, ''ఆ రాయిని చూశావా? నేను చెరువు నుంచి తెచ్చిన చేపలన్నీ దాని మీదనే శాశ్వత శాంతి సంపాదించు కున్నాయి,'' అన్నది.

ఎండ్రకాయ తొంగి చూసేసరికి ఆ రాతి మీద అనేకంగా చేపల ఎముకలు కనిపించాయి. అప్పుడది తనలో, ''ఈ ప్రపంచంలో తెలివిగల వాళ్ళు తమ స్వార్థం కొరకు మిత్రులై ఉండి కూడా శత్రువులు గానూ, శత్రువులై ఉండి కూడా మిత్రులుగానూ అభినయిస్తారు. శత్రువులై ఉండి కూడా మిత్రులుగా నటించే వారితో చెలిమి చెయ్యటం కన్న పాములతో చెలిమి మంచిది. కొంగ చేపలన్నిటినీ అదివరకే తినేసిందన్నమాట. వాటి ఎముకలే ఇవన్నీ. వాటి కోసం పగతీర్చు కోవటానికి ఇది అద్భుతమైన అవకాశం'', అనుకున్నది.

కొంగ రాతి మీద వాలబోతుండగా ఎండ్రకాయ, కొంగ తనను రాతి మీద పడెయ్యక ముందే దాని మెడను తన గిట్టలతో గట్టిగా పట్టేసింది. ఆ పరిస్థితిలో కొంగ ఎండ్రకాయను ఏమీ చెయ్యలేక పోయింది. అది అక్కడ నుంచి ఎగిరి పోబోయింది. కాని ఎండ్రకాయ సన్నగా ఉన్న కొంగ మెడను గిట్టల మధ్య గట్టిగా పట్టి, తెగిపోయే దాకా నొక్కింది.

తరవాత ఎండ్రకాయ కొంగతలను పట్టుకుని చెరువుకు తిరిగి వచ్చింది.

అక్కడ ఉన్న చేపలు ఎండ్రకాయను, "అన్నా, తిరిగి వచ్చావేం?" అని అడిగాయి.

ఎండ్రకాయ వాటికి కొంగ తలను చూపి, "ఈ దుర్మార్గుడు మనల నందరినీ మోసగించాడు. ఈ దుష్టుడి మాటలు నమ్మి, పాపం, చేపలన్నీ చచ్చిపోయాయి. ఈ నమ్మకద్రోహిని చంపి, వాడి తల తెచ్చాను. పల్లెకారుల కథ అంతా ఈ దుర్మార్గుడి కల్పన," అన్నది.

నక్క ఈ కథ చెప్పిన తరవాత కాకి, "మిత్రమా, పామును ఎలా చంపాలో చెప్పు," అన్నది.

నక్క ఇలా అన్నది: "ఏదైనా గుడికో, కోనేరుకో వెళ్ళు; ధనికులది ఏ రత్న హారమో, మరేదైనా నగో తీసుకుని వచ్చెయ్యి. జనం నీ వెంట పడతారు. వాళ్ళు చూసేటట్టుగా ఆ నగను పాము పుట్టలో పడెయ్యి. వారు ఆ నగ కోసం తప్పక పుట్టను తవ్వుతారు, అప్పుడు పామును తప్పక చంపేస్తారు."

కాకి తన ఇంటికి వెళ్ళి, నక్క చెప్పిన ఉపాయం తన భార్యకు చెప్పింది. రెండూ బయలుదేరి రాజభవనం లోని కొలనుకు వెళ్ళాయి. త్వరలోనే రాణి స్నానానికి కొలనుకు వచ్చి, తన రత్న హారమూ, ఇతర నగలూ తీసి ఒడ్డున పెట్టి, కొలనులోకి దిగి జలకాలాడ సాగింది. ఆడ కాకి చప్పున రత్నహారాన్ని తీసుకుని తన గూడు ఉన్న చెట్టు కేసి నింపాదిగా ఎగురుతూ పోయింది. ఇది చూసి మనుషులు గట్టిగా అరుస్తూ, దుడ్డుకర్రలతో వెంటపడ్డారు.

ఆడ కాకి రత్నహారాన్ని పాముపుట్టలో పడేసి, ఎడంగా ఒక కొమ్మ మీద వాలి గమనించ సాగింది. ప్రతీహారులూ, సేవకులూ హారం కోసం పుట్ట తవ్వారు. పాముకు కోపం వచ్చి, పుట్టలో నుంచి పైకి వచ్చింది. అందరూ చేరి పామును చంపి, హారం తీసుకుపోయారు.

ఈ విధంగా కాకులకు పాము బెడద తీరిపోయింది.



# 146. అమెరికాలో రష్యను ఆలయం

అలాస్కా (ఉత్తర అమెరికా)లో కొంత భాగం రష్యా కింద ఉండేది. సిట్కా అనే చోట రష్యను అన్వేషకులు ఈ క్రైస్తవాలయం నిర్మించి, సిట్కాను అలాస్కాకు రష్యనురాజధానిగా చేసుకున్నారు. ఈ ఆలయం 1804 లో నిర్మాణమయింది. 1867 లో అమెరికనులు రష్యాచక్రవర్తి వద్ద అలాస్కాను కొనుక్కున్నారు. ఇటీవల అలాస్కా అమెరికాకు 49 వ రాష్ట్రం అయింది.



Photo by Pranlal K. Patel



బహుమతి పొందిన వ్యాఖ్య తోటలో శృంగారం పంపినవారు : ఎ. టికపతి

Photo by Nivas Jadhav



జెమిని పాన్‌షాప్,
వరంగల్.

చేనులో బంగారం

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు





★ వ్యాఖ్యలు ఫిబ్రవరి నెల 20 వ తేదీ లోగా చేరాలి.

★ వ్యాఖ్యలు ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలో గాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు ఏప్రిల్ నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

### ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు


| | | | | | |
|---|---|---|---|---|---|
| అమరవాణి | ... | 8 | కుదిరినరోగం | ... | 33 |
| యక్షపర్వతం – 21 | ... | 9 | దొరికిపోయినదొంగ | ... | 38 |
| పురుషద్వేషిణి | ... | 17 | ధారానగర పండితులు | ... | 46 |
| శ్రమబరువు | ... | 24 | మహాభారతం | ... | 49 |
| పూరీలశాసనం | ... | 28 | మిత్రభేదం – 8 | ... | 57 |
| ప్రసన్నాంజనేయం | ... | 31 | ప్రపంచపు వింతలు | ... | 61 |


రెండవ అట్ట:
బికనీర్ కోటలో

మూడవ అట్ట:
జంతర్ మంతర్ లో

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3 Arcot Road, Madras-600026. Controlling Editor: 'CHAKRAPANI'

